192

# హిందూమత ద్రోహము



## ప్రథమ భాగము

గ్రంథకర్త:
కవిశేఖర : మన్నవ నరసింహపాకయాజి.



1936



(వెల 0-4-0

మా గ్రంథములఁ గూర్చి విమర్శాదర్శకు లాదరముతో బంపిన లేఖ.

బ్రహ్మశ్రీ కవిశేఖర బిరుదవిరాజిత
మన్నవ నరసింహాకవిగారి సమ్ముఖమునకు.

కవిశేఖరా! సహస్రాభివాదనంబులు. సాహిత్యవిశారద (కోస వెంకటరాయశర్మగారి) యనుగ్రహప్రేరితంబులు - భవదీయ కరుణాప్రేషితంబులు. భవద్విరచితంబులును నగు సద్గ్రంథ రాజములు మదీయ కరంబుల నలంకరింప వందనములతో నవ్వాని నందికొని కాలక్రమపఠనం బొనర్చి యమందానందమును జెందితిని.

భవదీయోత్కృష్ట కవిత్వము నిరర్గళ సహజ ధారాసమన్వితంబును, ప్రౌఢభావవిలసితంబును, గంభీరార్థసంపూరితంబును నై మృదుపదభూయిష్ఠంబును, మనోహరపదవీవిశోభితంబును నై సరసకవీంద్రుల కెంతయేని ప్రమోదంబును జేకూర్చునదియై యొప్పారుచున్నది.

అతి దుర్ఘటంబులును, మహాకవి సాధ్యంబులును, నగు నేకప్రాససంకలితంబులు - సోమేశ్వర స్తవ, దేవీ స్తవ, ఆనందగురు స్తవ, చిత్తవిస్మృతి - కోశరత్నంబులు. మీ సహజ ధారాప్రవాహమును, ఉద్యోగభోగ, సంస్కారదేవతా స్తవ పుస్తకమణులు. మీయపూర్వ సామర్థ్య ప్రౌఢ భావప్రకాశకంబులును, లోకజ్ఞానప్రబోధకంబులునై విరాజిల్లుచున్నవి. సుమారు నెల దిన

ములనుండి ఆరోగ్యభాగ్యమును బడయఁ జాలకున్న నేను— మీగ్రంథము లెంతపొగడికకైన నర్హములై యున్నను — నింత కంటె విశేషించి ప్రస్తుతము వ్రాయఁజాలకున్నాఁడను. క్షమింప వేఁడెదను. క్షేమము తెలుపఁ బ్రార్థితులు.

చిత్తగింపుడు,

25—9—1936 }
పిఠాపురం. }

విమర్శాదర్శక
నడకుదుటి వీరరాజకవి.

# పీ ఠి క

హిందూమత మంతరించుటకు బాలికావివాహముల పై శ్రీ హరవిలాసశారదాగారు చట్టమును పెట్టియున్నారు. వీరు క్రైస్తవమతమున కొక ద్వారమగు నార్యసమాజకులు. వీరి నాయకులలో శ్రీగాంధిగారు తనకుమారునకు వర్ణాంతర వివాహ మొనర్చి క్రైస్తవాచారప్రకారం రిజిష్టరు చేయించియున్నారు. మరియొక మోతీలాలు నెహ్రూగారు తాను హిందువుడను కానని యు తన కేమతము లేదనియు తెల్పియున్నారు. హిందువులు కానివారు హిందూమతముపై శాసనమును గోరగలిగియుండుట నేటి దేశచారిత్ర్యమున కొక నూతనాధ్యాయము లభించినట్లు గమనింపదగియున్నది. ఈ చట్టము రజస్వలాకు పూర్వమాడ వలసిన వివాహ విధిని బలాత్కారముగ తప్పించి పిమ్మట వివాహమాడవలసిన విధినిగాని కాలమును గాని నిర్ణయింప నందున వివాహము స్వైచ్ఛికము లని తెలుపుచున్నది. ఇక భారతాంగన లవివాహితలుగ నుండవచ్చును. అట్లవివాహిత లగువారు 14 సం॥ రములలోపల బిడ్డల కనినను నీ శాసనము బాధింపజాలదు. వివాహ మన గర్భాదానముతో పూర్తి గావింపబడు కర్మము. బాలికావివాహమనగా మంగళసూత్రము కట్టుటతో నంత్యమగు కార్యము. అట్లు బాలికకు రజస్వలాకు పూర్వము మంగళసూత్రము మెడకు కట్టుటతోడనే యీ శాస నము బెబ్బులివలె దుమికి ఆ తలిదండ్రుల ధనమానము లొక్క పెట్టున కబళించును. చట్టమనునది ప్రౌఢలపై ప్రయోగింపబడ వచ్చునేమోగాని మైనర్లగు బాలికల హక్కుల నిర్మూలించుట కేర్పడుట లోకవిరుద్ధము. జారకృత్యముల నిర్మూలించుట

కేర్పడవలసిన శిక్షాస్మృతి వివాహముల గూల్చుట కేర్పడుట హాస్యాస్పదము. కన్యాదానము, దైవారాధనముల వలన తమ పితరులకును తమకును సద్గతులు కలుగునను విశ్వాసము పారమార్థికమైన దగుటవలన బాహ్యదృష్టితో వ్యవహరించు శాసనసభ్యున కియ్యది అగోచరము. ఒకరాజ్యములో పెక్కు మతములుండుట సహజము. కాన మతపీడనమును రాజనీతి సహింప తగదు. శ్రీసార్వభౌముల వాగ్దానమునకును, ఇండియా ఆక్టులకును విరుద్ధ మగుటవలనను సెలెక్టుకమిటీవారు ప్యాసుచేసిన బిల్లుపై వైస్రాయిగారి అంగీకారము లేనందునను యీ చట్టమునకు శాస్త్రీయము లగు నాక్షేపములు కలవని ప్రాజ్ఞు లెరింగి ధర్మరక్షణ మొనర్ప గోరుచున్నాడను. ఈ గ్రంథమునకు నన్ను ప్రోత్సహించి సహాయమొనర్చిన శ్రీ గడియారం వెంకట శివయ్యశాస్త్రిగారికిని, తమ త్రిలింగపత్రికలో నా వ్యాసముల నన్నింటిని ప్రచురించి నాకుత్సాహము పురిగొల్పిన శ్రీ వావిళ్ల వెంకటేశ్వర శాస్త్రిగారికిని అందుద్యోగులగు శివపురపు నాగ వీరయ్యగారికిని నాకృతజ్ఞతను తెలుపుచున్నాడను.

సీ॥ పదిదినంబులకు తెంపగ నున్న జవరాలు క్రొత్త చీరెను కట్టుకొన్నయట్లు
ఉరికీఁత మెక్కి యూపిరి బాయదగు చాన పుత్రులఁగతిని పొగిలినట్లు
యమకింకరులబారి కరుగనున్న వెలంది తనయుల జేర్చి యోదార్చినట్లు
మునిగిపోనున్న యోడను వసించిన యింతి పూర్ణసమాధికై బూనినట్లు

గీ॥ సంఘ సంస్కార శాసనశస్త్రనిహతి
ధర్మదేవత మన కంత్యదశను జూపి
ప్రాణముల రేపొమాపొ గోల్పడగనుండె
నెట్టురక్షింతురో ప్రాజ్ఞు లెఱుగవలయు.

ఇట్లు,
కవిశేఖర: మన్నవ నరసింహ పాకయాజి.

శ్రీ గురుభ్యోనమః. హరిః ఓమ్.

# హిందూమత ద్రోహము.

ఆంగ్ల విద్యావాసనావశ్యులగు సంస్కరణ వాదుల కస్పృశ్యతానివారణాదికృత్యములు స్వాభావికధర్మములుగా పరిణమించుచుండినను వర్తమానకాలమందలి రాజకీయ రంగమునకు నాయకుడుగానున్న శ్రీ గాంధీమహాత్ముని చేనియ్యది పురస్కరించుకొనబడినందున నీయుద్యమము రాజకీయమున కావశ్యకమని కొందఱున్నూ, హిందూధర్మమును శాస్త్రసమ్మతముగా నడిపించుట కావశ్యకమని కొందఱున్నూ, సంశయాత్ములగుచుండిరని యూహింపవలసి వచ్చుచున్నది. రాజకీయరంగమున నిమ్నజాతులకు ప్రత్యేకనియోజకవర్గమును దొరతనమువారు ప్రసాదించుటమూలమున హిందూ సంఘముపై, భేదోపాయము నుపయోగించిరని తెలిసినప్పుడు హిందూసంఘమును బ్రద్దలుకాకుండా సంఘీభవింపజేసుకొని దొరతనమువారి యూహలను ప్రతిఘటించుటకు బదులు దొరతనమువారు చూపినభేదముకంటె వేయిరెట్లుగల యుగ్ర, నిమ్నజాతుల సమ్మేళనమునకు గడంగుటవలన రాజకీయ మార్గమున తమకుగల మందప్రజ్ఞనుమాత్రమే మహాత్ముడు వెల్లడించుకొనెనని స్పష్టీకరింపవలసి వచ్చుచున్నది. నిమ్న జాతులకు సంయుక్తనియోజకవర్గ మిప్పింపవలయుననియు, లేని

చో హిందువులకుగల యన్ని స్థానములందు నిమ్నజాతులకే యిప్పింపుడనియు జెప్పుటతో నిమ్నజాతులనాయకుడగు అంబేద్కర్‌గారు సమ్మతింపనియెడల 1916 సంవత్సరములో లక్నోలో జరిగిన దేశీయమహాజనసభలో తిలక్ మహాశయు డుపన్యసించినయంశమును జ్ఞాపకము తెచ్చుకొని నిమ్నజాతులకు స్వరాజ్యమునే యిప్పింపుడని సూచించినచో నన్నికక్షల నాయకులకు సులభముగా శాంతినూర్చెడివారలయ్యెదరని హెచ్చరింపవలసి వచ్చుచున్నది. యుగసహస్రములనుండి విహంగమార్గముగాకాక పిపీలికాదిమార్గమున నడుపబడుచున్న హిందూధర్మము నీతరుణమునందు సంస్కరణాగ్ని కాహుతి చేయ నుద్యమించుటతో యుద్భవించెడు ప్రజాందోళనము క్రింద తమ రాజకీయాందోళనము తుమ్మచెట్టుక్రింద నిమ్మమొక్కవలె నీరసస్థితియందుండునని మహాత్ము డూహింపలేకపోవుట దేశదౌర్భాగ్యమనిమాత్రమే శంకింపవలసివచ్చుచున్నది. యేవిధముగానయినను స్వరాజ్యప్రాప్తికి వర్ణసాంకర్యమవసరమని మహాత్ము డన్నిమతముల నేకభాండమునజేర్చి పాకముబట్టగలిగినప్పుడు మున్ను హిందూసంఘమును భేదించుటకుయత్నించిన ఆంగ్లరాజనీతికోవిదులు, హిందూసంఘము పూర్వధర్మమును వదలి భ్రంశరూపముగా నుండెననియు, ప్రాణమువంటిధర్మమును గోల్పోయిన హిందువులు స్వరాజ్యమును బడయుట కెట్లు లర్హులగుదురనియు ప్రశ్నించినచో నప్పుడుమహాత్ముడు తిరిగి తమ యుద్దేశ్యములను మార్చుకొని వేదముల నపౌరుషేయములని సిద్ధాంతము చేయవలసివచ్చునేమోయని సంశయింపవలసి



వచ్చుచున్నది. వేదశాస్త్రములయందుగాని, కులములయందుగాని కులదైవములయందుగాని, యజ్ఞయాగాదులయందుగాని గౌరవమును నిర్మూలించుకొని తుదకు తమతలిదండ్రులకు శ్రాద్ధాదులనుకూడ నిర్మూలించుకొనవలసిన యస్పృశ్యతానివారణోద్యమమును దొరతనమువారి మూలమున మహాత్ముని సృష్టింపవలసివచ్చిన దనుకొనుట కంటె తమకుల ధర్మమునకుభిన్నముగా మాల, లేక మాదిగపిల్లను పెంచుచున్న మహాత్మునకు స్వభావమనిమాత్రమే యెఱుంగుట క్రమమనిదోచుచున్నది. ఇకమహాత్ముడు హిందూమతమును వేదశాస్త్రబద్ధముగాచేయుటకు యత్నించుచుండె ననువాదమునకు వేదమననేమో యెఱుంగడనియు, శాస్త్రముల నరయగల గీర్వాణభాష నెఱింగినట్లెన్నడు వినియెఱుంగమనియు, గీతలకుభాష్యము వ్రాసెననుటకంటె గీతలపై యుపన్యసించెననుట క్రమమనిపించుకొనుననియు, తాము వ్రాసినభాష్యము బ్రాహ్మణుల కన్వయించదనుటచే నది ప్రస్తాపించవలసినదిగా కనుపించదనియు, గీతలపైని తమకుగల నమ్మకమునకున్నూ గీతలయందలి భావములకున్నూ చీకటికిని వెన్నెలకునుగల మైత్రికలదనియు తెలుపుటతో వీరికిగల శాస్త్రవాదమునకు స్వస్తిచెప్పదగి యున్నదని పాఠకు లూహింపగోరుచున్నాడను. స్త్రీలు సద్వర్తనము దొఱగిన యెడల వర్ణసాంకర్యముకలుగుననియు, నందువలన వారి పితరులు లుప్తపిండోదకులయ్యెదరనియు గీతాశాస్త్రమునందు ప్రథమమున ప్రస్తాపించినందులకు సృష్టిధర్మప్రబోధమునకు విరుద్ధముగా వర్ణసంకరోద్యమమునకు నడుముకట్టి తమకు

గీతాశాస్త్రమునం దభిమానముకలదనియు, తాను సనాతన ధర్మపరాయణుడనియు సనాతనుల మెప్పింపయత్నించుట ఇంద్రజాలికప్రజ్ఞను ప్రదర్శించుటయే కాగలదని మహాత్ము డేలదలపడోయని శంకింపుచున్నాడను.

ఇక దేశకాలములు మాఱిపోయినవి గనుక హిందూ మతమును మార్చుట యావశ్యకమను సంస్కరణవాదుల వాదమునకు సమాధానము చెప్పవలసినప్పుడు యుద్ధముల వల్ల గ్రామములు నిర్జనప్రదేశములు కావలసినప్పుడుగాని, లేక భూమిజలపాతమగుట సంభవించినప్పుడు గాని దేశము మాఱెనని చెప్పవచ్చునుగాని సర్వసౌఖ్యప్రదాయినిగా వున్న దేశము మాఱెననుటకంటే నభివృద్ధియయినదనుకొనుట న్యాయమాడినట్లగుననియు, నవిచ్ఛిన్నమును బ్రహ్మస్వరూప మును నగుకాలమునకు మార్పును జూపింప యత్నించుట యాకాశమును విభజించుటను బోలియుండుననియు తెలుపుటతో తృప్తిజెందెదరని విశ్వసించుచున్నాడను దేశకాలములనగా నూటికిపదిమంది ఆంగ్లవిద్యావశ్యులై మాఱుటయే యని యర్థము చెప్పదలంచినయడల నట్టి తమవికారమును నూటికి 90 మందిగల సనాతనధర్మపరాయణులకంటింపజూచుట క్రమముకాదని మాత్రమే తెలుపవలసివచ్చుచున్నది మాల, మాదిగలు హైన్యము ననుభవింపుచున్నారు గనుక వారిని నగ్రవర్ణములో చేర్చుట యావశ్యక మనువిషయమునకు జబాబుచెప్పవలసినప్పుడు హైన్యమనునది దారిద్ర్యచిహ్నము గాని కులచిహ్నము కానేరదనియు, దారిద్ర్యకంకణముధరించిన



బ్రహ్మ, క్షత్రియ, వైశ్య. శూద్రజాతులయందుసైత మీ హైన్యము మిక్కుటముగా ప్రదర్శింపబడుట చూచుచునే యుంటిమనియు, నీహైన్యమునకోర్వలేక బర్మా, రంగూన్, నేటాలు, అస్సాం, పినాంగు, మొదలగుదేశములకు తెలగ, ఉప్పర యెరుకల మొదలగుజాతులు వలసవెళ్లుటచూచుచునే యుంటిమనియు, మతసాంకర్యము దేశదారిద్ర్యము నడంప జాలదనియు తెలుపుటతో చాలునని యూసింపవలసి వచ్చు చున్నది. రాజకీయమునుబట్టిగాని, శాస్త్రమునుబట్టిగాని, దేశకాలములబట్టిగాని, దారిద్ర్యమునుబట్టిగాని, యస్పృస్యతా నివారణోద్యమమును మహాత్ముడు సృష్టించుటయనావశ్య కమని విమర్శించినప్పుడిట్టిఘోరమయిన ధర్మవిప్లవమునకు నడుముకట్టుట యాంగ్లవిద్యావాసనా మహిమవల్లనే యని మాత్రమంగీకరించుట విధియని తోచుచున్నది. ఆంగ్లవిద్యా వాసన మహాత్మునంతటి ధీశాలినివశముచేసుకొనగలదాయని ప్రశ్నించునెడల హిందూదేశములో ఆంగ్లవిద్యనేర్చినవాడు తనమతమును నిందించుననియు, దేవుడేలేడని వాదించుననియు, క్రైస్తవమతములో కలియుననియు, నాచారములయందును, నూహలయందును నితడు హిందువుగా కనుపించినను ఆంగ్లే యమార్గమునే అనుసరించుచుండు ననియు, ఆంగ్లవిద్య హిందూదేశములో సరియయిన హిందువునకును ఆంగ్లేయు నకును మధ్యఒక క్రొత్తజాతిని సృష్టించగలదనియు "లార్డు మెకాలె" వ్రాసిన అభిప్రాయములకు వీరిహృ దయవీధియందు తాండవమాడెడి యభిప్రాయములనుమిళిత ము చేసినయెడల సంశయముతీరునని తెలియవచ్చుచున్నది.

మహాత్ముడాచరించుదానినే చెప్పును, చెప్పినదానినేయాచరించునని దృఢసంకల్పమును సంస్కరణవాదులు వెల్లడించునప్పుడు వీరంగీకరింపని శాసన సభాప్రవేశమును కీర్తిశేషులగు చిత్తరంజనదాసు మొదలగు ప్రముఖులంగీకరించి కార్యరూపమున సమర్థించిరని తెలుపుటతో నీప్రశ్నముతిరిగి మొలకయెత్తనేరదని యూహింపవలసి వచ్చుచున్నది.

రాజకీయోద్యమమున భారతాంగనలు పాల్గొనవలయునని మహాత్ముని భావమునకు విరుద్ధముగా కీర్తిశేషులయిన లాలాలజపతిరాయిగారు దొరతనముచే నిషేధింపబడిన ఒకానొకసభలో లాహోరునందు పట్టుబడినప్పుడు స్త్రీలు రాజకీయమునపాల్గొనుట అనావశ్యకమనిన్ని పురుషులు రాజకీయమునజరించునప్పుడు వారికి గృహములందు సదుపాయములమర్చిన చాలుననిన్నీ బోధించియున్నారని తెలియవచ్చుచున్నది. విద్యాలయములన్నియు మూసివేయవలసినదని వీరు తీవ్రముగా శాసించినప్పుడు లజపతిరాయిగారున్నూ పండితమాలవ్యాగారున్నూ యిందులకు సమ్మతింపక విద్యాలయములకాపాడుటకు ప్రయత్నించిరని కూడా పత్రికలుచాటగా పాఠకులు వినియుందురని హెచ్చరింపవలసివచ్చుచున్నది. 1922 సంవత్సరమాప్రాంతముల వీరు తీవ్రమయిన యసహాయోద్యమమును భరతఖండమున వ్యాపింపజేసి వైస్రాయిగారితో ప్రత్యేకముగా ముచ్చటించుటకు యత్నించగా యిప్పటినుండి వీరు ప్రజానాయకులుకాజాలరని లజపతిరాయిగారు ప్రకటించినసంగతి పాఠ



కులకు తిరిగి జ్ఞాపకముజేయుటకు యవసరమనితలంపవలసి వచ్చుచున్నది. ఇకబర్డోలి, ఆనంద కైరాప్రదేశమందలి ప్రజలవల్ల స్వరాజ్యమును సంపాదించెనని యొకతూరియును గుజరాతునందలి ప్రజలవల్ల స్వరాజ్యమార్జించెదనని మఱియొకతూరియును శపథముజేయుట మూలమువ తమఅభిప్రాయమును వెల్లడించి విరమించియుండిరనుటయందసత్యమేమాత్రమును లేదని పాఠకు లెరుంగగోరుచున్నాడను. నిజముగా దేశక్షేమమునుగోరుకొందఱు బుద్ధిశాలురచే దేశసంక్షోభమునకాకరమగు నస్పృశ్యతానివారణోద్యమమునుండి మహాత్మునకు ధర్మోపదేశముచేసి మరల్పవలసినదనిపంపబడిన శ్రీమహామహోపాధ్యాయ పండిత. శ్రీయుత పంచానన తర్కరత్న భట్టాచార్యమహోదయులమ్రోల 1933 సంవత్సరం జనవరి రెండవ తేదీనాటికి శ్రీగురువాయూరు కృష్ణదేవాలయమున నస్పృశ్యులతో ప్రవేసించినమీదట యెంతకాలమయినను ధర్మముల వినెదనని మహాత్ముడు నుడువుటయు, నేను బ్రాహ్మణుడనయినయెడల నాదినమున నీవు ప్రవేసింపజాలవని మహోదయధర్మసింహము గర్జించినమీదట నిరుత్తరులగుటయు, నాలయప్రవేశార్భాటమును విరమింపజేసికొనుటయు ప్రాజ్ఞులెఱింగియుందురని విశ్వసింపవలసి వచ్చుచున్నది. ఇట్లు మహాత్ముడుచెప్పినదానిని నిర్వహింపకపోవుటయు, వీరిభావములు కొన్ని దేశనాయకులకు వ్యతిరేకములనితోచి నిరసింపబూనుటయు, తటస్థించినప్పుడు నస్పృస్యతానివారణోద్యమమున వీరు వాక్రువ్వుడువిషయనులు కేవలము న్యాయసమ్మతములయినవనిన్నీ దేశహిత

ములయినవన్నియు పత్రికలు ఘోషించుట సనాతనులకన్నులకు కారముగొట్టుటమాత్రమే కాగలదని యంగీకరింపవలసివచ్చుచున్నది. మహాత్మశబ్దము నాధారముచేసికొని ధర్మవృక్షమును నఱుకుటకుద్యమించిన మోహనదాసుగారి సనాతనత్వమును ప్రశంసించుచూ అలహాబాదునందు 1933 సం॥ జనవరి 25,26,27 తేదీలయందు సనాతనధర్మసభను గూర్చిన శ్రీ పండిత మదనమోహనమాలవ్యాగారి సనాతనత్వము నించుక ప్రాజ్ఞులకెఱింగించుట విధియనితలంపవలసివచ్చుచున్నది. శ్రీ కాశీక్షేత్రమందు తే 29-10-1928 ది మొదలుకొని ది 8-11-1928 వరకు నానా దేశములనుండి విచ్చేసిన 2150 ప్రతినిధులతో నిర్వహింపబడిన అఖిలభారత వర్షీయ బ్రాహ్మణసమ్మేళన మహాసభకుగాని 1932 సంవత్సరం డిశంబరున గురువాయూరులో 2000 మందిసభ్యులతో జరుపబడిన అఖిలభారత బ్రాహ్మణ ధర్మసభకుగాని వీరు వెడలకుండుట సనాతన ధర్మమునకు వ్యతిరేకులగుటవల్లనే యని తాము వేఱొకసభకు ప్రతిష్ఠించుటమూలమున రుజువు చేసికొనిరని స్పష్టీకరింపవలసి వచ్చుచున్నది. తమ గృహమునకు తామే పెద్దలనినట్లు తాము సమకూర్చిన సభకు తామే సభాధిపతులుగను తమ కుమారులగు రమాకాంతమాలవ్యాగారు కార్యనిర్వాహకులుగను నియమించుకొనుటమూలమున యీ రెండుస్థానములకు వీరిని మీాఱినవారావిద్వత్సభ నలంకరించి యుండలేదని యూహింపవలసి వచ్చుచున్నది. కాశీయందలి వర్ణాశ్రమస్వరాజ్య సంఘమువారివల్లనున్నూ, కాశీవిద్వాంసులవల్లనున్నూ, ప్రయాగ, జైనపురము, బలియానుండివచ్చిన



విద్వాంసులవల్లనున్నూ, వివిధరాష్ట్రములయందలి విద్వాంసులవల్లనుగాక శ్రీ మాలవీయుని హిందూవిశ్వవిద్యాలయమునందున్న మహామహోపాధ్యాయ అన్నదాచరణతర్కచూడామణి, మహామహోపాధ్యాయ పండిత బాలకృష్ణమిశ్ర, శంకరభట్టాచార్య, అనంతరామశాస్త్రి, రామరత్నఓరుణ, విద్యాధరశర్మ వేదాచార్య మొదలగు విద్వత్సింహులవల్లనాసభ బహిష్కరింపబడుటవల్లనున్నూ, శ్రీమాలవ్యాగారు సభావిజ్ఞప్తిపంపినను కాశీరాజుగారు ప్రయాగకువెల్లి గంగాస్నానమాచరించి సభనువీక్షింపక తిరిగి కాశికివెడలుటవల్లనున్నూ దర్భాంగమహారాజుగారిని సభాపతిగాకోరినను ప్రయోజనములేకుండుటవల్లనున్నూ యాసభను దేశీయ సనాతనధర్మసభ యనుటకంటె తద్వ్యతిరేకముగ ప్రదర్శింపబడిన నాటకసమాజమనుట స్వభావోక్తి యనుపించుకొనునని యాసింపవలసివచ్చుచున్నది ఆసభ హిందూధర్మదేవతను చండాలప్రణవోపదేశము, చండాలదేవాలయప్రవేశమున్నగు అధర్మాస్త్రములచే ముక్కలు ముక్కలుగాఖండించి పశ్చిమసముద్రములో కలుపుటకు సంకల్పింపబడినదగుటచే ధర్మరక్షకులును కాశీపండితులును అగు కమలనయనాచార్యులవారిని విషయనిర్ణయసభను జొరనీయక నిరాకరించుటయు, స్వామీ లాలవాదజీ అనుపండితునిసభనుండి వెడలకొట్టుటయు, ధర్మహింసకు సహింపలేనిపండిత, పండితేతర ఘోషలు మిక్కుటములగుటయు, కింకరప్రదర్శనము లభించుటయు, సాధువులునువిద్వాంసులున్నూ ధిక్కారములతో సభను విసర్జించుటయు, విరుద్ధముగామాట్లాడువారికి అవకాశ

మొసంగమనియును, మాఅభిప్రాయము నంగీకరింపనివారు లేచిపోవచ్చుననియు సభాపతిగారు వాక్పారుష్యముగా మాటలాడుటయుజూడ యీసభానాటకము రౌద్రరస పూరితమై విద్వత్సంక్షోభమును ప్రజ్వలింపజేసినదనుటయం దసత్యములేదని విశ్వసింపకోరుచున్నాడను. దేశీయధర్మసభ యనుపేరుతో శ్రీపండితమాలవ్యాగారివంటి దేశనాయకులు 100 నూరుమంది పండితులమనువారిని కూర్చుటయందాశ్చర్యము జనింపనేరదుగాని యీపండితమండలిలోనధికసంఖ్యాకులు మాలవ్యాగారివలె ఆంగ్లవిద్యావాసనావశ్యులు కావచ్చునని యూహింపవలసి వచ్చుచున్నది. ఆహ్వానములబంపి శ్రీమాలవ్యాగారు కూర్చిన రెండువందలమందిగల ప్రయాగసభకంటె ఆహ్వానములబంపక సేతు కాశీతలమధ్యగల విద్వాంసుల నాకర్షించి ధర్మధ్వజమునుస్థాపించిన ధర్మవీరులగు శ్రీజామరిన్ గారి గురువాయూరుసభ సంఖ్యనుబట్టిఅయినను అగ్రస్థానము వహించినదనుటమూలముగా సంస్కరణవాదుల నయితమునిరుత్తరులజేయగలమని యాసింపవలసివచ్చుచున్నది. వీరు సనాతనులను మెప్పించుటకు సనాతనధర్మపరాయణు డనని పేరుపెట్టుకొని సంస్కరణవాదులుకోరెడి ప్రౌఢావివాహము, అస్పృశ్యతానివారణము మొదలగు విదేశాచారములను ఆర్య, బ్రహ్మసమాజములతృప్తికొఱకు హిందూమతమునజొనిపి నిర్మూలించుటకు బహుకాలమునుండి యత్నించుచున్నట్లు పత్రికలుచాటుట పలుమారు వినవలసి వచ్చుచునేయున్నది. శ్రీమాలవ్యాగారికిగాని యిట్టి మఱి యొకదేశనాయకునికిగాని అన్వయించునట్లు భారతధర్మద్రోహవారక,



మహారాజాధిరాజశ్రీ లేటు దర్భాంగమహారాజావారు తే 7-11-28 దీన కాశీబ్రాహ్మణమహాసభలో వ్యక్తీకరించిన అంశము లింపుపాఠకులకు వెల్లడించుట అప్రస్తుతముకాదని మన్నించి యాలకింపగోరుచున్నాడను. "బ్రాహ్మణులు మొదలుకొని చండాలురపర్యంతము ప్రతివారికిని సర్వమందిరములలోనుప్రవేశించుట కధికారముకలదని తన్ను సనాతన ధర్మావలంబునిగా ప్రకటించుకొనుచున్న యొకానొక సుప్రసిద్ధనాయకుడీవ్యవస్థను ప్రకటించియున్నాడు. కాని అతడు మందిరములయొక్కగాని, ఉపాసనావిధియొక్కగాని, యదార్థమహిమనెఱుంగడు. కనుకనే అతడు ధర్మవిరుద్ధమైన యీవ్యవస్థను సాధారణజనులమెప్పును బడయుటకై యే జేసియుండును. కొన్ని మందిరములలో మూర్తినిసమీపించుటకును స్పృశించుటకును యిటువంటి సుప్రసిద్ధనాయకులకు నయితము అధికారములేనంతగా కట్టుబాట్లిప్పటికినియున్నవి. ఒకవేళ అట్టిసుప్రసిద్ధులయిన లీడరుమహాశయుల యుపదేశములవలనగాని, బరిశ్రమవలనగాని చండాలురకు మందిర ప్రవేశాధికారమీయబడినచో ఉపాసనాతత్వమెఱింగిన ఉన్నతజాతులవారీమందిరములలోనికిబోవుట మానుకొందురు. అప్పుడవి చండాలురకొఱకే "రిజర్వుడు" అయిపోవును. అతడుచేసినవ్యవస్థను మనమేకాదు. ఏశుద్ధసనాతనధర్మావలంబుడును అంగీకరింపజాలడు సరిగదా మీదుమిక్కిలి యతని యిట్టివిచారములుచూచినచో మరింత అసహ్యభావమేర్పడును. మనదేవమందిరములు ప్రతివారును ప్రవేశింపదగిననాటకశాలలున్ను, సినిమాలుకావు. ఇవి శుద్ధమైన ఉపాసనకేర్పడినవి

గాని తమాషాగృహములుకావని అందఱును తెలిసికొందురుగాక యని కోరుచున్నాము. ”

ఇట్లు సనాతనధర్మవాదిగా పేర్కొనబడిన శ్రీమదనమోహనమాలవ్యాగారు బాలికావివాహ వయోనిర్ణయ శాసనమునుగురించి హిందూధర్మమునకు విరుద్ధమయినదనిగాని, శాసనసభకు మతముతో సంబంధమువుండకూడదనిగాని, చట్టమునుదెచ్చిన శ్రీహరవిలాసశారదాగారు హిందూమతమునకు క్రైస్తవ, తురుష్క, బౌద్ధమతములకంటె దూరస్థమయిన ఆర్యసమాజమునిగాని, వంశక్రమాగతముగా వచ్చుచున్న శ్రీసార్వభౌముల మతసంబంధమయినవాగ్దానమునకు భిన్నమయినదనిగాని, నిస్పృహులును తపస్సంపన్నులునగు మహర్షులవాక్యములను భోగపరాయణులును లౌకికశిఖామణులునగు మానవులు చర్చించుటహాస్యాస్పదమనిపించుకొనునవనిగాని, చర్చించలేకపోవుటమూలమున సంస్కరణవాదమునగల యభిమానమునే వెల్లడించుకొనిరనియు, వీరు చట్టమునకనుకూలముగా వోటునియ్యకుండుట అధికసంఖ్యాకులగు సంస్కరణవాదుల శీర్షములయందుగల నమ్మకమే కారణముకావచ్చుననియు నూహింపవలసి వచ్చుచున్నది. శ్రీమాలవ్యాగారు శారదాచట్టమున కనుకూలముగా వోటునివ్వక సనాతనులకుచూపినలాభముకంటే సంస్కరణవాదులకును సనాతనులకును మధ్యవర్తిగానిలిచి వివాహప్రాయము పన్నెండుసంవత్సరములుగా నిర్ణయించుకొనుట శ్రేయోదాయకమగునని వెల్లడించినద్యుక్తి



మిక్కిలి యపాయకరమును నష్టదాయకమును కాగలదని స్పష్టీకరింపవలసివచ్చుచున్నది. బాలికలు పన్నెండుసంవత్సరములలో పుష్పవతులుకారని పండితునకు నిజమైన నమ్మకమున్నయెడల లోకానుభవము శూన్యదశయందున్నదనియు, పన్నెండు సంవత్సరములలోపల కొందఱుపుష్పవతులయినను దోషము లేదని వీరియభిప్రాయమయినయెడల ప్రథమములో 12 సం॥ ములునిర్ణయించి బ్రాహ్మణులకు మాత్రమీచట్టమిబ్బందికరమని ప్రకటించిన శారదాగారికంటె వీరు తీవ్రమయిన సంస్కరణవాదులనిమాత్రమే నిశ్చయింపవలసి వచ్చుచున్నది. ఇక యీచట్టమునకువిరుద్ధముగా తనకుమార్తెకు వివాహముచేసిన భారతీయుడగుగార్గ్యాఖ్యుడు పరుల ప్రాణముల నపహరించినహంతకునికంటె క్రూరుడుగనుకనే యితనిపై మండలాధిపుని మ్రోల అభియోగపత్రము మొలకయెత్తుటతోడనే దోషియనియు, దోషారోపణము చేయవలసిన బాధ్యతనుండి ఫిర్యాది విముక్తుడనియు తెలిపెడి యిందలి క్రూరములగు సూత్రములగుఱించి శ్రీమాలవ్యాగారు మౌనముద్రవహించుటయు, సంస్కరణవాదియు నిజముగా న్యాయవాదియునగు శ్రీవరాహగిరి జోగయ్యపంతులుగారు శారదాచట్టమును, చట్టమునందలి సూత్రములను, శాసనప్రయోగమునకు గల అనవసరవిషయములను, తీవ్రముగాఖండించుచూ గంభీరోపన్యాస మొసంగుటయుజూడ సనాతనులమని ప్రకటించుకొనువారిలో సంస్కారప్రియులును, సంస్కరణవాదులలో కొందఱయినను సత్యవాదులును గలరనిమాత్రమే పాఠకులూహించుట కవకా

శముకలదని వెల్లడింపవలసివచ్చుచున్నది. హిందూధర్మమును పువాదితో పెకలింపగలిగిన బాలికావివాహవయోనిర్ణయ శాసనమును, చండాలప్రణవోపదేశమును చండాల దేవాలయప్రవేశమును నంగీకరించుటమూలమున సంస్కరణవాదులకును వీరికి నభేదదశప్రాప్తించినపుడు వీరిని సనాతన ధర్మవాదియని సనాతనులుభ్రమించుట యెండమావులయందలి జలభ్రాంతిని పోలియున్నదని విశ్వసింపవలసివచ్చుచున్నది. శ్రీమోహనదాసుగారిభావములను మదనమోహనులవారాదరించుట యెంతస్వభావమనిపించుకొనినను ఆంగ్లవిద్యాలయములు భారతీయులధనవయోవిభవములనుకబళించుచున్నవి గనుక కాశీవిశ్వవిద్యాలయము హరిజనులకు సత్రశాలగా నుపయోగింపదగునని మహాత్ముడుపదేశించినయెడల నది మాత్రము కేవలమువిరుద్ధాంశమని పండితుడు సులభముగా జబాబు చెప్పగలడని యూహింపవలసి వచ్చుచున్నది. తామార్జించిన ధనమునందుగాని, తామునిర్మించిన విద్యాలయమునందుగాని దీనులకింతవర కవకాశమొసంగజాలని శ్రీ మదనమోహనమాలవ్యాగారు హిందూమత సాంప్రదాయానుసారము యెవరోదాతలు నిర్మించిన దేవాలయములు చండాలప్రవేశార్హములని సభాముఖమున ప్రచురించుటక్రమమనుటకంటె వర్తమానకాలమందలి దేశనాయకలక్షణమనుట యుచితమనిపించుకొనునేమోయని యూహింపవలసి వచ్చుచున్నది. ప్రౌఢాంగనల కామసంకల్పోదయకాలమే వివాహప్రాయమున కనుకూలమని కనిపెట్టిన శ్రీశారదా మహర్షి, చట్టమును విమర్శించుటకు గల కాలవ్యవధిని



భరింపజాలక అసెంబ్లీలో దొరతనమువారిని ప్రార్థించుసమయమున "మేయో" హిందూమతముపై వ్రాసినగ్రంధమును సూచింపవలసివచ్చుటయు, స్టేటుకౌన్సిలులో యీచట్టము పవిత్రమయినదని సభ్యులకు చెప్పవలసినప్పుడు శ్రీ వేమవరపు రామదాసుపంతులుగారు టర్కీనిచూడుడని ఉపన్యసించుటయు తటస్థించినప్పుడు విదేశీయులును, విదేశాచారములును యీచట్టమునుద్భవింపజేయుటకు కారణములని స్పష్టమగుచుండగా యీచట్టము హిందూశాస్త్రసమ్మతమనియు, దేశహితమనియు సనాతనవాదులమను శ్రీమాలవ్యాగారు యేలభ్రమింపవలసివచ్చెనో యూహింపజాలకున్నాడను. హిందూధర్మములున్నూ శాస్త్రములున్నూ నేటి ఆంగ్లవిద్యావాసనావశ్యులవల్ల దోషభూయిష్టములుగా పరిణమించుచుండినను హిందూదేశమున శాకాశనులుగను, మాంసాశనులుగను కొన్ని తెగలుకలవనియు నట్టిశాకాశనుల ఆచారములు మాంసాశనులమర్యాదలకంటెభిన్నములుగావుండుననియు నెరింగిన శ్రీమాలవ్యాగారు జాతిసమ్మేళనకుద్యమించుచున్న మహాత్ముని సనాతనవాదియని కొనియాడుచున్నప్పుడు శ్రీ మాలవ్యాగారిభావములు ధర్మవిప్లవమునకే ఆకరములని స్పష్టీకరింపవలసి వచ్చుచున్నది. కీర్తిశేషులగు బాలగంగాధరతిలకుగారివలె శ్రీ మాలవ్యాగారు తమ బ్రాహ్మణవంశజులును, స్వధర్మానుష్ఠానపరులును శాకాశనులునయియుండిన్నీ తమకులాచారముల నేవిదేశధర్మారణ్యముననో పాతిపెట్టి యీదేశమున కేమోలాభము కలుగజేయవలయునని యత్నించుట దేహమందలితోలు చేతినియూడబెఱికి బంగారు

కేలు నమస్సులను బోలియుండునని విశదీకరింపవలసి వచ్చుచున్నది. శ్రీమాలవ్యాగారికి హిందూధర్మనిరతులనియు, రాజనీతికోవిదులనియు హిందూస్థానమున పేరున్నంతవరకు నేవిధమునవయినను ధర్మవిప్లవము వీరియౌదాసీన్యమో ప్రోత్సాహమోలేకుండా జనింపనేరదనియు, మహాత్మునితో కూడిన అందఱి సంస్కరణవాదులధాటి, మిక్కుటముగానున్నదనిన యెడల సూర్యకిరణములయందలి వేడిమికంటె ఆకిరణప్రసారముచే వెచ్చబడినయిసుక, అద్దపుముక్కలయొక్క వేడిమి, సహింపజాలనంతగాయుండుట సహజమనియు, నంతమాత్రమున వేడిమియొక్క ప్రాశస్త్యము కిరణమునకన్వయించునుగాని యిసుకకు, నద్దపుముక్కలకు నన్వయింపదని పాఠకులూహింపగోరుచున్నాడను. మహాత్ముడు చండాల దేవాలయప్రవేశమునకు దొరతనమువారిని, సంస్కరణవాదులను ప్రోత్సహించుట మాలవ్యాగారికి యిష్టములేదనుటను కార్యరూపమున ప్రదర్శింపనంతవరకు సనాతనలోకము విశ్వసింపజాలదని వెల్లడింపవలసివచ్చుచున్నది. శ్రీమాలవ్యాగారు హిందూధర్మముపైజూపిన యనాదరముజర్చించుట నింతటవిరమించి యీగాథకు కథానాయకులగు శ్రీగాంధీమహాత్ముని ధర్మోద్దేశ్యములను పాఠకుల కెఱింగింపనుద్యమించుచున్నాడను.

మహాత్మునకు గల అస్పృశ్యతా నివారణాదిభావములు మతమునకు సంబంధించినవి అగుటవలన వీరికి మతమునుగూర్చిన విద్యార్జన మెంతవఱకు కలదో తొలుత పాఠకుల కెఱింగించుట యావశ్యకమని తోచుచున్నది. వీరు గుజరాతు దేశమునందలి పోరుబందరు పురమునబుట్టి బాల్యమునుండియు నాంగ్ల



విద్యయే అభ్యసించిరనియు, బారిష్టరనుపేరుగల విదేశీయమగు నున్నతవిద్యనభ్యసించుటకు క్రైస్తవదేశములో నివసించిరనియు, కుటుంబపోషణమునకు సయితము మ్లేచ్ఛదేశమనబడు దక్షిణాఫ్రికాలో నివసించిరనియు, వినగలిగినప్పుడు వీరుపఠించినవిద్యయు, నివసించినదేశములను, హిందూమతమున కుపయోగకరములయినవిగా పరిణమింపనందున హిందూమతమన నెట్టిదో వీరెఱుంగకుండుట స్వాభావికమని మాత్రమే విశదీకరించుట విధియనితోచుచున్నది. మహాత్ము నంతటిధీశాలి ఆంగ్లవిద్యనభ్యసించినంతమాత్రమున హిందూమతమును మఱచునాయని సంస్కరణవాదులు ప్రశ్నించిన యెడల ఆంగ్లవిద్యనభ్యసించినహిందువు తనమతమును నిందించుననియు, క్రైస్తవమతములో కలియుననియు నాంగ్లవిద్యాప్రాశస్త్యమును వెల్లడించిన లార్డు మెకాలెవాక్యములుగాక ఆంగ్లవిద్య నేర్చిన ఆంగ్లాంగనలుకూడా చెడుచుండినట్లు ఆంగ్లదేశచారిత్రకుడగు రివరెండు 'స్మిత్' అనువారుకూడా లిఖించినట్లు శారదాచట్టమును చర్చించుతరుణమున యం. కె. ఆచార్యాగారొసంగిన గంభీరోపన్యాసములో పాఠకులు చదివియుందురని తిరిగి హెచ్చరికజేయుచున్నాడను. లార్డు మెకాలెగారి దృగ్విలాసము ఆంగ్లవిద్యాభూజమునకు లేబ్రాయమందుబుట్టిన ఫలసముదయమందుమాత్రమే ప్రసరించి హిందువుడగు నాంగ్లవిద్యార్థి తనమతమును గోలుపోవునను సామాన్యవిషయములమాత్రమే బ్రచురించి తృప్తిజెందెననియు, ఆవిద్యావృక్షమునకు ప్రౌఢదశయందుబుట్టిన ఫలవైఖరిని గమనించునంతటి నిలుకడలేకపోయెను గనుక నే

క్రైస్తవనియమములగు ప్రౌఢావివాహము, వితంతూ
వివాహము, అస్పృశ్యతానివారణములు, వేదోక్తములయిన
వని చెప్పునంతటి మహాత్ములుకూడా ఉదయించెదరని యెఱుం
గజాలకుండెననుట నిర్వివాదాంశమని పాఠకులెఱుంగగోరు
చున్నాడను. మహాత్ముడు విదేశధర్మార్ణవమున క్రీడించుటను
గూర్చి ఒకానొకనటుని నాట్యవిలాసమున కానాటక
సమాజమువారు మెచ్చుకొనునట్లు మహాత్ముని సహచరులును,
స్వాధ్యాయులును అగు సంస్కరణవాదులు మెచ్చుకొనుట
కంటె యీక్రీడకాకరమైన విద్యాప్రదాతలగు మెకాలె
వంశమువారు మెచ్చుకొనుటసార్థక మనిపించుకొనునని
మాత్రమే వెల్లడింపవలసివచ్చుచున్నది వీరు హిందూధర్మ
ములకు సంబంధించినశాస్త్రము లేశమయినను యెఱుంగరని
తెలుపుటకు అహోరాత్రములు లిఖితరూపకముగాగాని
వాగ్రూపముగాగాని వీరు భూనభోంతరములు నిండునట్లు
వెల్లడించుచున్న వ్యాసోపన్యాసములయందు శాస్త్రజ్ఞానమును
సూచింపజాలిన ఉదాహరణములగాని, సామ్యములగాని
లక్షణములగాని, ప్రదర్శింపనందున సంస్కరణవాదులు
సయితము వీరికి శాస్త్రజ్ఞానముకలదని వాదింప సాహసింపరని
ఆసింపవలసివచ్చుచున్నది. అస్పృశ్యతానిర్మూలనమునుగూర్చి
తే 10-4-1929 దీన తెనాలివాస్తవ్యులగు శ్రీలక్కరాజు
సోమసుందరరావుగారు బెజవాడలో మహాత్మునికలిసికొని
కొన్ని శాస్త్రసమ్మతములగు ప్రశ్నలువేయగా శాస్త్రీయ
ప్రమాణములను వేనినిచూపజాలననిన్ని సి. వి. వైద్యపండిత
సతవేలాకరుగార్లు సప్రమాణముగా చెప్పగలరని సమాధాన



మిచ్చుటచే వీరివాదము శాస్త్రముపై నాధారపడినదిగా
నూహించుటకువీలు లేదని తెలుపవలసివచ్చుచున్నది. వీరు
యిప్పటిఅస్పృశ్యతానివారణోద్యమమున కూడా శాస్త్ర
వాదమునకు శ్రీఆనందశంకరధ్రువగారిపై యాధారపడినట్లు
మాట్లాడుచున్నప్పుడు వీరికి శాస్త్రానుభవముకలిగియున్నట్టు
సంస్కరణవాదుల ఘోషించుట పుట్టనిబిడ్డకు పెట్టినపేరును
బోలియుండునని తెలుపవలసివచ్చుచున్నది. శాస్త్రబద్ధమయిన
హిందూమతమును శాస్త్రానుభవములేని వీరు మార్పయత్నిం
చుట క్రమము కాదని తెలుపుటకు వీరికిగల శాస్త్రజ్ఞాన
సంపత్తునుచర్చించి యిక హిందూధర్మమును వీరు నిరశించి
రనుటకు వీరిని యెరవాడజైలులోదర్శించి కొన్నిప్రశ్నలను
వేసినట్టియు వీరికి బాల్యస్నేహితుడగునట్టియు రణచోట
దాసు పట్వాడి ఎక్సుదివాన్ మోర్జీగారు తే 8-1-1933 ది
రాత్రి పూనానగరమున పురవాసులకోరికపై నుపన్యసించుచూ
వీరు కులకమాగతముగా వచ్చుచున్న
జందెమును బొట్టును తీసివేసిరనియు, మూర్తిపూజ
కుడదనియు చెప్పునుగాని తాను ప్రార్థించుసమయమున
మూర్తినిదగ్గఱవుంచుకొనడనియు, వర్ణాశ్రమధర్మముల నసింప
జేయునాందోళనమును సాగించుచున్నాడనియు చెప్పినట్లు
13-1-33 తిలకుగారి మరాటాకేశరిచెప్పగా తే 23-1-33ది
త్రిలింగప్రచురించెరని పాఠకులకు జ్ఞాపకముచేయుచున్నా
డను. వీరు విదేశములలో మతాంతరులొసంగు విందులనార
గించుటయు, మాలపిల్లను పెంచుటయు, మాల, మాదిగల
యాచారములవంటి ఆచారములుగలదేశములలో నివసించు

టయు, హిందూమతమును నిరసించిరను వాదమునే బలపఱ
చుటకు తోడ్పడగలవని పాఠకు లూహింపగలరని విశ్వ
సించుచున్నాడను. రాజకీయమునుగూర్చిన దేశనాయకుల
విదేశయాత్ర యేవిధముననూ ఆక్షేపణీయము కానేరదని
సంస్కరణవాదు లెదురించునెడల హిందూదేశమునకు సుప్ర
సిద్ధనాయకమణియగు బాలగంగాధరమహాశయుండు విదేశ
యాత్రనుసలుపవలసినప్పుడు దాని నాపద్ధర్మముగా నంగీకరింప
వలసివచ్చినట్లు వెల్లడించెననియు మహాత్ముడు విదేశమనిగాని,
విమతసంకీర్ణమనిగాని లేశమయినను సందేహించినట్లు పాఠకు
లెఱుంగకుండినప్పుడు వీరికిగల హిందూధర్మనిరసనభావమునే
స్మరించుట విధియనితోచుచున్నది. ప్రపంచమునం దెవ్వరును
యెఱుంగని అఖండవేదజాలమొకటికలదనియు, చతుర్వేద
ములు మధ్య మధ్య అందులో చేర్చుచూవచ్చిరని వీరు
చెప్పినట్లు సంస్కరణవాదులపత్రికయగు నాంధ్రపత్రిక
తే 8-11-32 ది వెల్లడించుటవలన చతుర్వేదములు కల్పి
తములని యొకఅసత్యమును, చతుర్వేదములకు భిన్నముగా
అఖండవేదజాలమొకటికలదని మఱియొకఅసత్యమును చెప్ప
జాలినప్పుడు వీరికి హిందూధర్మము నందుగల నిరసన
భావమునే మఱియొకతూరి ప్రకటించు కొనురని పాఠకులు
గమనింపగలరని యూహింపవలసి వచ్చుచున్నది. హిందూధర్మ
నిర్మూలన మనతగిన బాలికా వివాహవయోనిర్ణయ శాసన
ముదయించు నరితవఱకు శాసనసభ్యులను, శాసనమంగీకరిం
పిమ్మట బొంబాయి న్యాయవాదులను, చట్టము నమలున
పెట్టింపుడని ప్రోత్సహించుట కూడా జరిగినపుడు హిందూ



ధర్మమునందు వీరికిగల అసహనమునుమాత్రమే బలపఱచు
కొనిరనికూడా పాఠకులు గమనింపవలసియున్నదని విన్న
వించుకొనుచున్నాడను. అస్పృశ్యతా నివారణోద్యమమునకు
విద్యార్థులను, దౌరతనమువారిని సంస్కరణవాదులగు
విదేశాచారప్రియులను, తోడ్పడుడని మొఱపెట్టుటగూడా
హిందూధర్మ నిర్మూలనమునకు మాత్రమే పన్నినపన్నుగడ
యని పాఠకులూహింపగలరని యాసించుచున్నాడను. వీరి
చర్యలనుబట్టియింతవరకు మేమూహించిన విషయములుగాక,
వీరుహిందువులనేమి, హిందూమతమునేమి, హిందువుల
దేవాలయములనేమి, హిందువులదైవములనేమి, హిందూమత
గ్రంథరాజములనేమి, హిందువులశాస్త్రములనేమి, హిందువుల
ఆచారములనేమి, హిందువుల సాంప్రదాయములనేమి,
హిందూమతమను కల్పకారణ్యమునకు బీజప్రాయముగా
నున్న మహర్షులనేమి, హిందూమతమునకు ప్రాణమువంటి
అస్పృశ్యతనేమి, వేదములనేమి, ఘోరముగను క్రూరముగను
నిందించినట్లు శ్రీకృష్ణఅను పేరుగల 17-1-33. హిందీడైలీపేపరు
వెల్లడించిన అంశముల పాఠకులెఱుంగుట కిందునుదహరించు
చున్నాడను. అందు శ్రీకృష్ణుని అవతారపురుషునిగా నేనుతలంప
ననియు, నాతల్లియు, తండ్రియు, సీతాఅమ్మవారుకూడా పాకి
వాండ్రే అనియు, శాస్త్రమనగా పాషండమనియు, ఋషీశ్వ
రులు సైతానులనియు,హిందువుల ధర్మము సైతానువంటిదనియు
హిందువులదేవాలయములు భోగముకొంపలనియు, హైంద
వము నీరీతి నీసడించినప్పుడు పైవాక్యమునందు సూచించిన

అన్ని అంశములకు విరోధములగుసమాధానము లిందుగలవని ప్రాజ్ఞులూహింపగలరని విన్నవించుకొనుచున్నాడను. ఇక శ్రీకృష్ణుడవతారమూర్తి కాడని నందులకు శ్రీకృష్ణుడవతార పురుషుడని నమ్మవలసినవారు హిందువులనియు, హిందువులనగా వర్ణాశ్రమధర్మనియమ బద్ధులనియు, వర్ణాశ్రమములనగా నాయావర్ణములకు కులక్రమాగతముగా వచ్చుచున్న వేదోక్త కర్మములనియు, వేదమనగా దైవోచ్ఛ్వసితమనియు, దైవమనగా పయినజెప్పిన నియమములనన్నింటిని సక్రమముగా నాచరించి భక్తియు, జ్ఞానము నార్జించిన మహర్షులకు ప్రత్యక్షమగు తేజోమయమగు స్వరూపమనియు, నట్టి తేజోరాశియే శ్రీకృష్ణుడనియు, నట్టి శ్రీకృష్ణుని పరమాత్మగా తలంచుటయే హిందూధర్మముయొక్క ముఖ్య లక్షణమనియు చాటుటతో సంస్కరణవాదులు నిరుత్తరులుకాగలరని అపేక్షించుచున్నాడను.

ఇంక దేశనాయకులుగా పరిగణింపబడిన శ్రీ పండిత మోతీలాల్ నెహూౄగారికి గల హిందూమత విశ్వాసమును సూచించుచున్నాడను. 1929 సం॥రం॥ డిశంబరులో లాహారులో శ్రీ పండిత జవహరిలాల్ నెహూౄగారి యాజమాన్యమున జరిగిన కాంగ్రెస్సుపై కాశి, మీరటు, ఢిల్లీ, బొంబాయి, కలకత్తా మొదలగు స్థలములనుండి ధర్మవీరులు వెడలి 25 డిశంబరున నల్లజండాలతో దృఢమైన బహిష్కారము జరిపి "కాంగ్రెస్సు తనను స్వరాజ్యముకొఱకును స్వాతంత్ర్యము



కొఱకును ప్రయత్నించుచున్నదానినిగా చాటుకొనుచున్నదనియు వాస్తవమాలోచించినచో రాష్ట్రీయోద్ధానము స్వాతంత్ర్యము స్వరాజ్యము స్వధర్మమును పాలించుకొనుటచేతనే సులభముగా లభింపగలవనియు ప్రతిభారతీయుడును త్రికరణశుద్ధిగా తనధర్మమును పాలించుకొనుచు దేశసేవపేర స్వాతంత్ర్యము కొఱకు ముందంజవేసినపక్షమునస్వరాజ్యముస్వాతంత్ర్యమువారికిచేరువయగుననియు నట్లుచేయక మతధర్మము విడుచుకొన్నయెడల వ్యర్థమగుటయేగాక మరింతబాధనమునకున్నూ బానిసతనమునకునులోను చేయకమానవు" అనుఅట్టి మేటమును వ్రాసి దానిని బంగాళములో సుప్రసిద్ధుడైన అడ్వకేటు శ్రీయుత మహేశచంద్రచటర్జిగారు చదివి వినిపించుచూ "బుద్ధిజాడ్య జనితోన్మాదులగు కాంగ్రెస్సు నాయకులు దేశహితమునకు గర్భశత్రువులై యగుపడుచున్నారు. కాని మనవారీసత్యమునుపేక్షించి కాంగ్రెస్సుయొక్క శక్తిద్వారా ధర్మవిషయమున ద్రోహము చేయుచున్నయుద్దండపిండములగు నాయకుల నడచుట దేశహితమునకై మిక్కిలి యావశ్యకము, వారినట్లణగద్రొక్కనియెడల వారివలన దేశస్వాతంత్ర్యమునకును మహాజనుల ధర్మమునకును గొప్పవ్యాఘాతము కలుగకమానదు. నేను ప్రతిజ్ఞాపూర్వకముగా చెప్పుచున్నాను. నేను కాంగ్రెస్సునకును తదధ్యక్షునకును నంతముకలిగించి ధర్మద్రోహులు చేసినదానికి బదులుతీర్చుకొని తీరుదును" అనిచెప్పియున్నారు. అంత 30 డిశంబరున మోతీలాల్ నెహూౄగారి పిలుపున సనాతన ధర్మవాదులు నియతస్థలమునకు వెడలిన పిమ్మట

లక్ష్మణశాస్త్రిగారు:- మోతీలాల్ గారితో? మీరువృద్ధులును దేశనాయకులగుటనుబట్టి కాంగ్రెస్సు ఎవరిదని తమ్మడుగుచున్నాను.

మోతీ:- దేశమంతటిదిని.

శాస్త్రిలు:- దేశమునందు జైన, పార్సీ, సిక్కు, క్రైస్తవ, మహమ్మదీయ, ఆర్యసమాజ, సనాతన ధర్మమతముల వారందరు కలిసియున్నారు. అయితే కాంగ్రెస్సువీరందరిదియునా?

మోతీ:- నిస్సందేహముగా.

శాస్త్రిలు:- కాని కాంగ్రెసులో సనాతన ధర్మవాదులకు ప్రవేశముండ కూడదని నియమమున్నప్పుడుమీ లక్ష్యమెట్లుసిద్ధించగలదు.

మోతీ:- సనాతన ధర్మావలంబులు కాంగ్రెస్సులోనుండదగదన్న నియమమేమున్నది?

శాస్త్రిలు:- అస్పృశ్యతా నివారణము.

మోతీ:- యీ విషయమును మీరుగాంధిగారి నడిగినచో ఆయనబాగా బోధింపగలడు.

రాజేశ్వరశాస్త్రి:- గాంధి గోహత్యచేసినవాడు. మేమతనితో మాట్లాడము తమరేమాకు బదులుచెప్పుదురుగాక.

మోతీ:- అట్లుగాదు. కాంగ్రెస్సులో నధికసంఖ్యాకులుప్యాసు చేసినారు. తమరుకూడా యందధిక సంఖ్యాకులయినచో తమ మాటలే ప్యాసుకాగలవు.



లక్ష్మణశాస్త్రి:- అట్లయినచో కాంగ్రెస్సులో ఏపక్షము ప్రబలమై ప్రవేశించునో అదే రెండవపక్షము నడచివేయును గదా? ఇదెక్కడినియమము. గాక అస్పృశ్యోద్ధారము వలన కాంగ్రెస్సునకేమిలాభమున్నదండి.

మోతీ:- హైందవసమాజములో సముచితమైన గౌరవమును బొందజాలక అస్పృశ్యులు మహమ్మదీయములో క్రైస్తవములో చేరుదురు. వారిని సమానమైన స్థితికిదెచ్చుటకిది యంగీకృతమైనది.

శాస్త్రిలు:- వారు మహమ్మదీయులుగాగాని క్రైస్తవులుగాగాని అయినట్టుల కాంగ్రెస్సుతాలూకు రాష్ట్రీయ కార్యమునకేమి హానికలుగును. కాంగ్రెస్సనగా హైందవులదే యగునా? యీ పక్షపాతమునకసలురహస్యమేమి.

మోతీ:- మంచిది. ఇప్పటికుండనిండు గొప్పపనిలో చిక్కువడి యున్నాను. యింతవఱకు నేను భోజనముచేసియుండలేదు. భోజనమునకు పోగోరుచున్నాను.

సంఘాణీ:- తమరు కాంగ్రెస్సు సభాధ్యక్షులైయుండి అనారోగ్యావస్థలో శారదా బిల్లును సమర్థించుటకై అసెంబిలీలో ప్రతికాంగ్రెస్సు సభ్యునిపేరను తంతివార్తనంపి యుండలేదా? ఏతద్వారమున కాంగ్రెస్సుపక్షమునుండి ధర్మముపైని హస్తక్షేపముకాలేదని చెప్పగలరా?

మోతీ:- లేదు-లేదు. అదినేను నావ్యక్తిగతమైన అధికారము వలన జేసియున్నాను.

సంఘాణీ:- కానిండు, కాంగ్రెస్సుతాలూకు టిక్కెట్టువలన జనసముదాయము తరఫున ప్రతినిధిత్వమునుపొంది, జనసముదాయముయొక్క సమ్మతికి విరుద్ధముగా తమవ్యక్తిగతాభిప్రాయమును బలాత్కారముగా నెత్తిన రుద్దుటకు తమకేమి అధికారముకలదు. తమరు సభాప్రవేశాధికారమును దేశసోదరులవలనపొంది వారికి ఘోరమైన విశ్వాసఘాతముః జేసినవారు కాకుందురా?

మోతీ:- తమరెట్లాలోచించుకున్నను సరియే. నేను భోజనమునకు బోగోరుచున్నాను. నన్ను క్షమింతురుగాక. నావిషయములో నేనిట్లు చెప్పదలచుకున్నాను. నేనుహిందువునుగాను మహమ్మదీయుడనుకాను, క్రైస్తవుడనుకాను. నాకేవిధమయిన ధర్మములేదు.

దేవనాయకాచార్య:- కాంగ్రెస్సుద్వారా ధర్మవిషయమున హస్తక్షేపముకాబోదని మా అనుమానమును నివారణచేయజాలకపోయినారు.

మోతీ:- నన్ను క్షమించండి. నేనుభోజనమునకు బోవగోరుచున్నాను. కాంగ్రెస్సుధర్మవిషయమునచేయి చేసికొనదని నమ్మికయుంచుడు.

దేవనాయకాచార్య:- అట్లైన అస్పృశ్యతానివారణమును కాంగ్రెస్సునుండియెత్తివేయ బడునా?

మోతీ:- సనాతనధర్మాను యాయియగు మాళవీయజీకూడా అస్పృశ్యతానివారణము నంగీకరించుచున్నాడుకాడా?



దేవనాయకాచార్య:- సనాతన ధర్మస్వరూపము వేదములు, తదంగములయిన స్మృతులు వానిలో అస్పృశ్యతా విచారణము నుంచుటకేవిధానము విధింపబడియున్నది. యీ మాటతో నెహ్రూగారుసమాధానము చెప్పజాలక క్షమింపుడని ప్రార్థించి వెడలుటకే పూనుకున్నాడని ది 6-1-1930 బ్రాహ్మణ సమ్మేళనపత్రిక తెలుపుచున్నది.

ఇట్టి దేశనాయకుల మతప్రవర్తనము నవలోకించి ఆర్యసమాజియు,నున్నతోద్యోగియు సంస్కారప్రియులును నగు దివాన్ బహదూర్, హరవిలాసశారదాగారు హిందూమతధ్వంసక మనదగు బాలికా వివాహవయో నిర్ణయశాసనము నసెంబిలీలో ప్రతిష్ఠించేవఱకు దొరతనమువారు దేశీయుల కొసగిన అవకాశమునుబట్టి యీ ఆక్టునురద్దుచేయుడనిగాని బాధితులకా చట్టమువర్తించకూడదనిగాని 543 టెలిగ్రాములు 483 తీర్మానములు 38,886 మంది చేవ్రాళ్లుచేసిన మహజర్లును ప్రభుత్వమువారికంపబడినవని తెలుపుకొనుచున్నాడను. అంతట స్వేచ్ఛనుఱిగి విచ్చలవిడి కలవాటుపడిన అల్పసంఖ్యాకులగు పడుచులప్రేరణచే నిగ్లాండులో పార్లమెంటు సభ్యురాలు "రాతుబోనుకన్య" మేయోబుక్కుపై నాధారపడిన కొన్ని యసత్యముల జెప్పి ఇండియామంత్రిగారిని త్వరపఱచినదనియు నప్పట్లో నానాజాతి ప్రజలకుతామే ప్రతినిధులమనియు వారిక్షేమములతామే యోజించుచున్నామనియు బలుకుచు తమనాయకుడగు 'గాంధి' గారిని మెప్పింప అసెంబిలీలో చేరిన కాంగ్రెస్సుసభ్యులను దొరతనమువారు

యోజించిరనియు 24-7-35 పాంచజన్యము ప్రకటించుచున్నది. అంతట కాంగ్రెస్సువర్కింగుకమిటి ఢిల్లీలో 4-2-1929 సమావేశమై బిల్లునకు తమపూర్ణ సానుభూతినిచ్చుచున్నామని తీర్మానించిరనియు 7-2-1929 పార్లమెంటులో 'టట్లిలు'గారు శారదాబిల్లు గతియెట్లున్నదని అండర్ సెక్రటరీ గారిని ప్రశ్నింగా 'వింటర్టను' ప్రభువుగారు ప్రత్యుత్తరమిచ్చుచు ఇండియా గవర్నమెంటువారికి బిల్లువిషయమై పూర్తిగా సహాయముచేయు తలపుగలదని వెల్లడించిరనియు నాటినుండి గవర్నమెంటు సభ్యులు తమవ్యక్తికి స్వాతంత్ర్యముల చట్టమువంకకే మఱలించిరని 24-7-1935 పాంచజన్యము ధ్వనించుచున్నది. తుదకు శాసనమును స్థిరపఱచు నప్పుడు హోంమెంబరు సర్ "జేమ్సుక్రెరారు"గారు "[illegible]మా) నివేదికయిట్టి శాసనముల జేసికొను నధికారముకోరి యున్నది. నెహ్రూ మొదలగు కాంగ్రెస్సునాయకుల బలమునుచూచుకొని" శారదాగారిబిల్లు నుపపాదించిరి. మహాత్మాగాంధిగారాశీర్వదించిరి. అఖిలభారత వర్షీయ కాంగ్రెస్సు కమిటీవారు సాయపడిరి. కాంగ్రెస్సుసభ్యులకు విప్పునందిచ్చిరి. దేశమందలి పెద్దపక్షమువారితో మేమునుతోడ్పడితి" మని వెల్లడించిరని 24-7-1935 పాంచజన్యము ప్రచురించుచున్నది. అంతట కాంగ్రెస్సు సంఖ్యతో తులతూగిన అర్జీలను తంతెలను తీర్మానములను లక్ష్యముసేయక దేశాందోళనము పాటింపక బిల్లునకనుకూలముగా ఓటునిచ్చిన ప్రజాప్రతినిధులు 27 మంది. వ్యతిరేకవాదులు 29 మంది. కాని దొరతమువారి తరపు-



40 వోట్లు బిల్లునకు బలమొసంగినవి. అసూయచే సభను విడిచిన మహమ్మదీయులు 15మంది అయియున్నారు! మతవిషయికమున కాంగ్రెస్సుపెద్దపక్షము కానేరదనియు నట్లు పెద్దపక్షముగానున్న యెడల గవర్నమెంటుతోడ్పాటు నవసరమనియు ఎప్పుడైనను మహాత్మగాంధిగారు రాజకీయముగు కాంగ్రెస్సునకే అధిపుడనియునట్టి రాజకీయమునకుగూడ వీరుస్టేట్స్మన్ కానట్లు రాజనీతిజ్ఞులు వెల్లడించిరని వినియుంటిమనియు నధర్మాందోళనమున వీరు గ్రుంకిన కొలదివీరిని కాంగ్రెస్సునుండి తొలగవలయునని పెక్కురభిప్రాయపడిరనియు నిందువలన వీరిదేశనాయకత్వము ప్రజామోదమును బడసినది కానేరదని విన్నవించుచున్నాడను. శారదాబిల్లునుగూర్చి కాంగ్రెస్సువారి ప్రకృతచర్యను గర్హించుచూ కుంభకోణము మొదలగు స్థలములలో కాంగ్రెస్సుసభ్యులే తీర్మానము లంపిరనియు శ్రీ. జి. వి. వెంకటరామయ్యరు యస్. యల్. దొరై మొదలగు కాంగ్రెస్సు సుప్రసిద్ధ నాయకులుకూడా మండలించిరనియు శ్రీ సత్యమూర్తి అయ్యరు, ఆర్ శ్రీనివాసయ్యంగారు బలపఱచిరనియు కడలూరులో 1929 సం॥రం నవంబరులో సమావేశమైన తమిళనాడు కాంగ్రెస్సుకమిటీ మీటింగులో అఖిల భారతవర్షీయకాంగ్రెస్సువర్కింగు కమిటివారి చర్యను ఖండించుచూ తీర్మానముపపాదించి కాంగ్రెస్సు కమిటివారు తీవ్రముగు నపరాధముచేసిరని స్పష్టపఱచిరని 24-7-1935 పాంచజన్యమువల్ల తెలియుచున్నది.

"ఈశాసనము జాగ్రత్తగా యోజించి చేసినదికాదనుట స్పష్టము. శాసనసభలోనదియంకురించినదాది రాజప్రతినిధిగారి యనుమతిని బడసినంతవఱకు దీనిచరిత్రను పరిశీలించితిమేని ప్రతిస్థానమందును నది యనాలోచితవిషయముగా స్ఫురింపక మానదు. బహుజనాభిప్రాయమునుచాలావఱకతికరించినదనుట స్పష్టము. నేను సంస్కారప్రియుడనేగాని యీ శాసనాందోళనమారంభించినప్పటినుండియు దీని ప్రోత్సాహకులు ప్రదర్శించిన మౌర్ఖ్యము, అసారతలమీకు జూపుచున్నాను. ఇట్టిశాసనములచేసిన వారలు సిగ్గునతలలువంచక తప్పదు. ఇట్టిది బుద్ధిమంతులుండెడియేదేశమందును జరుగదు. అట్టిదిఇండియాయందు జరిగినదనిన మనమందఱము సిగ్గున తలలువాల్చవలసి యున్నది."

14-7-1935 చితంబరోపన్యాసము, రైట్ ఆనరబుల్ శ్రీనివాసశాస్త్రిగారు

"ఈశాసనము బలపఱచి యుపయుక్తమగునట్టిదానినిగా జేయవలయునన్న ఈ శాసనమునకు మతసంబంధమగు అభ్యంతరములు కలవారలకు మినహాయింపునిచ్చుటకన్న వేఱుగతి లేదు." యీ శాసననిర్మాతలలో నొకరు,

దివాన్‌బహదూర్, ఎ రామస్వామి మొదలియార్.

"లజపత్రాయి, మోతీలాల్ నెహ్రూ, గాంధిగారలు రాజకీయముగా నెంతగొప్పవారైనను మతవిషయకనిర్ణయములందు వారి అభిప్రాయములు పాటింపతగినవికావు. క్రైస్తవులకు మహమ్మదీయులకు ధర్మనియమములందు వారివారి మత[illegible]రు వాక్యములెట్టు ప్రామాణికములో హిందువులకుగూడ నట్లెయుండుట న్యాయము. ఈశాసనమమలులోకి వచ్చిననిజమైన బ్రాహ్మణుడికనుండజాలడు. ఇంతకన్న మతహింసయుండజాలదు. ప్రచారప్రబోధములవల్లగాక శాసనసభలమూలమున సంస్కరణముల సంపాదింప నెంచుటలోనే సంస్కర్తలదౌర్బల్యము అల్పత్వములు వెల్లడియగుచున్నవి. ఈశాసనమక్రమము. అనవసరము. అనుపయుక్తము. హింసాకరము"



దివాన్‌బహదూర్ కె. ఆర్. శ్రీనివాసయ్యంగారు,
రిటైర్డుఫస్టుమెంబర్ ఆఫ్ మైసూర్ కౌన్సిల్.

"శారదాగారి మొదటిబిల్లునకు కమిటీవారి సలహాపైనాధారపడిన రెండవబిల్లునకు సంబంధమే లేనప్పుడు యీ రెండవబిల్లునకు రాజప్రతినిధిశాంక్షన్ లేనందున అసలీశారదాశాసనము శాస్త్రనిషిద్ధము అగుట చెల్లనేరదని వాదింపవచ్చును. సాంఘిక చరిత్రములో సాంఘికాచారములను శిక్షాస్మృతి పాల్సేయు శాసనములలోనిది ప్రప్రథమము."

ఎ యస్. శ్రీనివాసఅయ్యారు మద్రాసు అడ్వకేటు.

శారదాబిల్లునుగూర్చి వచ్చినబేకరుగంజి జిల్లాలోని ఒక కేసులోయిండియాఆక్టులురద్దు కానిది యిట్టిబిల్లులుండకూడదని కలకత్తా హైకోర్టువారు తీర్పుచెప్పియున్నారు.

"మతసమస్యను విచారింప నిప్పుడక్బరు దర్బారురాలేదు. మతవిశ్వాసమన్నిటి కంటె యెక్కువమైనది. మతమనునది మానవునికిని భగవంతునికినిగల సంబంధము దెలుపును. మతము పుచ్చుకొన వలసినదనియొకరు మరియొకరిని కోరతగదు. మానవులపశుస్వభావమును రెచ్చగొట్టి భగవచ్ఛాసనమునకు విరుద్ధముగా జేయుట కెవ్వరికిని హక్కులేదు. మతమును

మార్చుకొనునంతటివఱకు పని నెవ్వరును చేయరుగాక యని కోరుచున్నాను.''

భూలాభాయి దేశాయిగారు బొంబాయి 23-10-35 (అ. ప్రె)

మావ్యక్తి గతమగుహక్కును అరికట్టుచున్నది గనుక మాకువద్దు.

హెచ్. ఎ.జె.గిడ్నీ.

చిరకాలానుగతముగవచ్చుచున్న ఆచారము నీ శాసనము భూకంపమువలె తారుమారొనర్చుచున్నది.

మద్రాసు న్యాయమూర్తి, మె. కె.గారు.

“పరంపరానుగతముగ నాచరింపబడుచున్న యాచారములలోగలపవిత్రత్వమునెడలనీనాటిసంస్కర్తలు గొప్పయనాదరణను తిరస్కారమును జూపినంత నేమాయె. అట్టిసంస్కర్తలకే కేపో మాపోవారికే చేదుగా వెగటుగానున్నదుష్ఫలితములుదయించినప్పుడు తలతిరిగిరాక తప్పదు ఈ మహాపాయము నీనాటి సంస్కర్తలకు చూపించివారిని మందలించుటతో మాబాధ్యతను నెరవేర్చిన వారమగుచున్నాము.”

మద్రాసు మెయిలు (లీడరు) 25-9-1929

“ఇండియాయందు భారతీయాంగనలయొక్క పాతివ్రత్యబలమేలేని యెడల భారతీయులగు పురుషులిదివఱకే నశించి యుందురు.”

సర్. ఆండ్రూవింగేటు.

జీవితమునంతయు నేడేడు సంవత్సరములకొక్క దశగా భావింపవచ్చును. హక్స్లీదొరగారు చెప్పినట్లు ఇట్టిదశలో దేహసామగ్రియంతయు మాఱి క్రొత్తగా యేర్పడుచుండును సాధా



రణముగా మనుష్యునకుతన ప్రపంచికజ్ఞానాంకురములు రెండవ దశాప్రారంభమందే జనించును.

హెర్బర్టు, స్పెన్సర్.

ఇంగ్లండు దేశమునందిటీవలవఱకు శాసనవిహితమగు వివాహవయస్సు బాలికకు 12 సం॥లు బాలునకు 14 సం॥రములు, కాని ప్రజాభిప్రాయములుమార్పుజెందుటచే నావయోనిర్ణయములను చాలవఱకు ముందుకు గుంజిరేగాని యిప్పుడు శాస్త్రవేత్తలు వెనుకకు పోవలయునని తర్కించుచున్నారు.

రివరెండు. జె. టి డెవిస్ గారు.

ఐర్లండు దేశములోని కాపువారలలో సార్వజనీనముగా వ్యవహరింప బడుచున్న బాల్యవివాహాచారమే యీనాటికి వారలలోని స్త్రీలయందుగల మహత్తరమగు పాతివ్రత్యమునకు గారణమగుచున్నది. ఇంతియగాక వారిస్త్రీలలో గలుగు తీవ్రమైనట్టియు స్వభావజన్యమైనట్టియు, యువతీజనయోగ్యమగు గరువతనమున కాధారమగుచున్నది. యూరపుదేశమున కంతకు నీబీదకాపుజాతులే పాతివ్రత్యగౌరవమునకు చాలకాలమునుండి యెంతో ప్రఖ్యాతి వహించియున్నారు.”

ఐరోపాదేశ నీతి చరిత్రము, లెక్కీదొర వ్రాసినది.

“బాల్యవివాహములేలేని పక్షమున స్త్రీ పురుషులు నిజముగా నీతికి కట్టుబడినడచుటయే సున్నయని కొంచెమాలోచించినచో ప్రతివానికి తెలియవచ్చును. ప్రకృతిసిద్ధమగు రతిసౌఖ్యము ననుభవింపనీయక యీడువచ్చిన స్త్రీ పురుషులను శాసనమూలముగా నిర్బంధింపజూచుట యిదివఱలో చెప్పినరీతిగనట్టి స్త్రీ పురుషులయెడలను దేశముయొక్క జాతియెడ

లను సపాధమును గావించుటయేగాని వేఱుగాదు. అట్టి నేరముచే ప్రకృతి సిద్ధమగు నభిలాషను నాశనముచేసిన వారగుదురు

హ్యావలక్, ఎల్లిస్.

ఆంగ్లేయ ప్రామాణికుడగు మి. ర్. ఫర్నివలుదొరగారు మూడు శతాబ్దముల క్రిందట మన యింగ్లండులో బాల్యవివాహములున్నట్లు నిర్ణయించియున్నాడు. బాల్యవివాహములే కావు శిశువివాహములుకూడ నింగ్లండులో కలవు.

“ఆంగ్లవాసి బిసెంటుగారికంపిన లేఖ.”

ఈనాటికిగాని యింకా 50 యేండ్లకుగాని 100 యేండ్లకుగాని వివాహ బంధముయొక్క ఆధ్యాత్మిక శృంగార రసాదుల చెడగొట్టునట్టి మార్పులను శాసించుచూ చట్టముల నిర్మించిన యెడల నట్టిచట్టములు మానవజాతియొక్క క్షేమశ్రేయములకు విధ్వంసకములై బఱగుచున్నవి.

టిట్బిటు పత్రిక.

“ప్రసిద్ధిజెందిన ప్రాచీన రాజ్యములందెచ్చటనుగూడ హిందువులలోవలె స్త్రీలను చక్కని గౌరవముతో పాలించు జాతియింకొకటి కానరాదు.”

ప్రొఫెసర్-విల్సన్ దొరగారు.

“ఇండియాదేశములో 14 యేండ్లకుముందే రజస్వలలగు వారు నూటికి 71 మంది కలరని “లయర్[illegible]

దొర మెడికల్ జూరిస్ ప్రూడెన్సు అను గ్రంథములో వ్రాసియున్నారు.



“10 యేండ్లపిల్ల సమర్తాడెను. 11 యేండ్లకే పిల్లను కనెను. సుఖప్రసూతి. మగబిడ్డ. తూనికె అర్ధమణువు బఱువుండెను.”

లాంసెంటుపత్రిక 7-6-1902 న్యూజెర్సీ యఫ్. బి. మేలెన్.

“కేపుకాలనీలోనొక కన్య 13 యేండ్లకే బిడ్డను కనెను. 18-1-1902 రాబర్టుఫర్ దొర.

“గర్భవతి యగుటకును బిడ్డను కనుటకును యుక్తవయస్సువచ్చినందుకు చిహ్నము సామాన్యముగా మొదటి సారి ఋతుమతియగుటయే”

“గ్యాలబిన్” అనువారు వ్రాసినమిడ్ వైఫరీ(మంత్రసానిశాస్త్రము లో 45 పుట)

బాల్యవివాహము లాచరించు సాంప్రదాయముగల 22 కోట్ల హిందూజనసంఖ్యలో 24 లక్షలు విధవలుండగా (అనగానూటికి6గురు మాత్రమే) బాల్యవివాహములనాచరించని సాంప్రదాయముగల 4 కోట్ల జనసంఖ్యగల ఇంగ్లండులో 60 లక్షలుగల అవివాహిత స్త్రీలు (అనగా నూటికి 16 గురు చొప్పున) తమదుఃఖమయమైన జీవయాత్రను గడుపుచున్నారని 1930 సం॥రం ఫిబ్రవరి నెల 11 వ సంచిక గల స్వధర్మప్రకాశిని తెలుపుచున్నది.

1. దీనినిబట్టి బాల్యవివాహసాంప్రదాయములు నూటికి 94 మంది పురంధ్రీమణుల సాంసారిక సౌఖ్యోన్నతులనోలలాడ జేయుట మూలమున విజయస్థానమలంకరించినప్పుడేయాచార

మును నిరసించు వివాహశాసనము దేశ ద్రోహకరమైనదని తెలియుచున్నది.

2. 11 సం॥రలకు పుష్పవతియైన బాలికామణి యీ శాసనముప్రకారం 15 లేక 16 వ యేట వివాహమాడి అనతికాలములో భర్తనుగోల్పోయినయెడల రజస్వలానాటి నుండి 4, లేక 5 సం॥రములుభోగార్హమైనకాలము నాడార్భాగ్యురాలి కందనీయక నిర్బంధించెడి యీ చట్టము క్రూరమైనదని తోచుచున్నది.

3. ఇంద్రియాటోపములెఱుగక ముందుత్పన్నములగు ప్రేమానురాగములు బాల్యదశయందంకురించుటవలన నట్టి నిష్కళంకమైన యనురాగలతలు భర్తయందు ప్రసరింప జేయుటకు బాల్యవివాహములే యుచితములగుట వలన నట్టివిధానమును నిరోధించెడి యీశాసన మమానుషమైనదని గ్రహింపబడుచున్నది.

4 తలిదండ్రులు విచారించి చేయు బాలికావివాహములందు పాతివ్రత్యముమూర్తీభవించియున్నందున బాలికలు ప్రౌఢలైభర్తల వెదకికొనజెల్లునెడినెపమున వ్యభిచారోన్ముఖులజేయు నీశాసనము నింద్యమని గమనింపతగియున్నది.

5. బాల్యవివాహము లాచరించినబాలికామణులలో10లక్షల కొక బాలికయైనను దాంపత్య భగ్నమొనర్చుకొనజాలనప్పుడీ విధానమును బలాత్కారముగా దగ్ధమొనర్చెడి యీచట్టము ఘోరమైనదని తలంపబడుచున్నది.



6. బాలికకైనను బాలునకైనను తండ్రి, తండ్రిలేని యెడల తల్లి, అనగా ఒకరుమాత్రమె సంరక్షకులుగానుండుట లోక మర్యాదగా యున్నప్పుడు తండ్రియుండగా తల్లికూడా సంరక్షకురాలుగా భావించి బాధింపగల యీ శాసనమనాలోచితమని తెలియవలసి యున్నది.

7. ప్రోత్సాహకులుకూడా నేరస్థులుగా నీశాసనము చేర్చినందున విశ్వబ్రాహ్మణుడు, మంగలి, చాకలి, సాహుకారులతో తుల్యుడుగా పెండ్లికి తోడ్పడు పురోహితు నీశాసనము బాధించుట ఘోరమని తెలియుచున్నది.

8. ప్రౌఢలపై గర్భాధానసమయమున ప్రయోగింపవలసిన శాసనము పిల్లలపైనందు వేడుకగా జరుపుకొను వివాహములపై ప్రయోగింపడినందున శత్రుపక్షక్రియగా దీని తలప బడుచున్నది.

9. ఈ శాసనము వివాహముచేయకూడని కాలమునే చెప్పివివాహముచేయ వలసిన విధినిగాని కాలమునుగాని నిర్ణయించనందున వివాహోన్మూలనమే ప్రధానముగా యవతరించినట్టు తలపవలసియున్నది.

10, వివాహములేక, కామోద్రేకపూరితలై యేయింట పుట్టిన బిడ్డనామండిగము ప్రక్కనే విడిచిపెట్టుటవలన తగిన పోషణము నీతి, యికముందు భారతజాతికలవడని కారణమున నిర్వీర్యమైన దానినిగా జేయగల యీశాసన మక్రమైనదని చాట తగియున్నది.

11. ఈ శాసనము వైధవ్యమును నిర్మూలింప లేకపోగా అవినీతి ననారోగ్యదశను పెంపొందించుటకు తోడ్పడుచున్నందున దూష్యముగా తలపవలసి యున్నది.

హిందూమతములో వివాహమునకు పూర్వ మొక బాలికయైనను పురుష సంయోగము నెఱుంగకుంటయు 10 లక్షలకొక దాంపత్యమైనను వ్యతిరేకింపకుంటయు బాలికా వివాహముల పవిత్రతను చాటుచున్నవి. వికలాంగియైనను పిచ్చిదియైనను హిందువుగా బుట్టిన బాలిక, అవివాహితగా నుండ తగదనునీతి, హిందూధర్మస్వభావమును రుజువుచేయుచున్నవి. బాల్యవివాహములనగా యే తెగలందైనను సాంప్రదాయకులగు తలిదండ్రులు తమబిడ్డలకు గలబాల్యావస్థను తమనీతిప్రబోధముచే గడపి తమకును తమబంధువులకును సమ్మతమైన వరునకిచ్చి వివాహము చేయుటయగుటవలన పాతివ్రత్యమునకును, దాంపత్యసౌష్టవమునకును, బాలికావివాహము లగ్రగణ్యములని తెలియవచ్చుచున్నది. మానవజాతికి వివాహములవుసరమనియు, నట్టి వివాహములకు దాంపత్య సౌష్టవము ప్రయోజనమనియు, లోకము విశ్వసించువఱకి బాల్యవివాహము లేముఖ్య సాధనములని ప్రతిజ్ఞాపూర్వకముగా విన్నవించు చున్నాడను. 3 సం॥రములు మొదలు 7 సంవత్సరములవయస్సువఱకు బాలికలుయదృచ్ఛగా లభించిన శబ్దము విని మాతృభాషనిరర్గళముగా మాట్లాడ నేర్చినప్పుడు యౌవన, కౌమారదశలవలె బాల్యదశ విషయలంపటనందక



నిష్కళంకముగా నుండుటవలన యీదశాంతమందొనర్చిన వివాహమనురాగ పూరితమని తెలుపవలసియున్నది.

బాల్యవివాహమువలన వధూవర సంయోగములభింపదుగాన ఆరోగ్యమునకు ప్రౌఢదశవఱకు వివాహములాపుచుంటిమనుట సహేతుకముకా నేరదని తెలియుచున్నది. ఇంక వైధవ్యమును సూచించినయెడల నీచట్టము వైధవ్యమును నిరోధింపజాలదనియు నీ సాంప్రదాయపు ప్రజలలో 100 కి 6 గురుమాత్రమె వితంతువులు కలరనియు నందగ్రజులలో 100 కి $\frac{1}{2}$ వంతున మాత్రమేకలరనియు నింత కంటె సక్రమ వివాహములలో సులభమార్గము మఱియొకటి లభింపదనియు తెలియుచున్నది. 16 వ శతాబ్దమువఱకు యూరపుఖండమునందంతటను ఐర్లండులో నేటివఱకును బాల్యవివాహములు జరుగుచున్నవి. మంత్రసాని శాస్త్రములు వ్రాసినడాక్టర్లు ప్రథమరజోదర్శనమే గర్భమును ధరించుట కాస్పదమని వ్రాసియున్నారు. యూరపుఖండమందలి రాజనీతిజ్ఞులును దేశచారిత్రకులును బాల్యవివాహములతో కూడిన హిందూకుల ధర్మము పవిత్రమైనదని శ్లాఘించియున్నారు. యీబిల్లు ప్రజాప్రతినిధుల బలముతో ప్యాసుకాలేదు. గాన దొరతనమువారు బిల్లును నిర్మూలించి మతరక్షణ మొనర్చెదరని విశ్వసించుచున్నాడను.

# స్త్రీ స్వాతంత్ర్యము

బాలిక, బాల్యదశయందు తలిదండ్రులవల్లనున్నూ, సోదర సోదరీమణుల వల్లనున్నూ, మిక్కిలి గౌరవముగా పెంచబడి వారి కుటుంబదార్ఢ్యమునకు మీఱిన వ్యయముతో తగినవరుని వలన కొంత స్త్రీధనమును రాబట్టి వివాహమొనర్పబడుటయు, యౌవన దశయందత్తవారియింట సర్వాధికారముగలదిగా నుండుటయు, వార్ధకమున పుత్రపుత్రికా సంతానమువల్లను కోడండ్రవల్లను, పోషింపబడుటయు తటస్థించుచున్నందున భారతాంగనకు గల స్వాతంత్ర్యమధికతమమైనదని తెలియవచ్చుచున్నది. తమకుటుంబపోషణమున కవుసరములగు శ్రమలకోర్చి ద్రవ్యమార్జింపవలసిన బాధ్యత స్త్రీలకే మాత్రము లేదనియు పురుషుడు కష్టించి ధనమార్జించిన పిమ్మట కుటుంబమునకు వినియోగపరచవలసిన బాధ్యత స్త్రీలకు మాత్రమె కలదనియు, తమ మగలకు తోబుట్టువులుగాని బంధువులుగాని వీరు కాపురమునకు వచ్చినపిమ్మట వీరిచేతుల కెదురుచూచుచునేయుండవలయుననియు, నత్తమామలు సయితము కోడండ్రనాశ్రయించియే జీవయాత్రాలేశమును గడుపుకొనుచుండెదరనియు. తమసంతతులకు వివాహములు చేయవలసినప్పుడిరుపక్షముల నాడువారిపెత్తనముక్రిందనే కార్యక్రమము నడువవలసియుండుననియు, భారతజాతికి గల కట్టుబాట్లను ప్రకటించుచున్నాడను. బిడ్డలగని వృద్ధురాలైనను తమభర్తతో గృహకృత్యముల గూర్చిముచ్చటించవలసినప్పుడు బిడ్డలవలన



చెప్పించుకొనుటయు తమకంటె చిన్నవారైనను నాడుబిడ్డ వరస గలవారి యెదుట గూర్చుండ జాలకుండుటయు, మగనియింటి పేరటి మగవారికెన్నడును గనుపింపకుంటయు, నివి కుల స్త్రీలకు గల మర్యాదలని తెలుపుచున్నాడను. తమ సంతానమును పొరుగిండ్లకు పోనియ్యక దుష్టులకందనీయక వారికి బాల్యచాపల్యమును తమ సదుపదేశము వలన తొలిగించి వివాహములను, కులనియమప్రకార మొనర్చి పాతివ్రత్యమును నెలకొల్పుట భారతాంగనకు విధియని తెలుపుచున్నాడను భరతఖండమునందు వ్యవసాయదారులు, దరిద్రులు. మిక్కుటముగా గలరని తెలియుచున్నప్పుడు పిల్లల నింటివద్ద సవరించి భర్తలకు కూడుకట్టుకొని పొలమునకు పోవలసిన నారీమణుల కెట్టి స్వాతంత్ర్యమును సంస్కరణవాది యొసంగనెంచెనో తెలియ జాలకున్నాడను. స్త్రీ స్వాతంత్ర్యమనగా భర్తకు గల ఐశ్వర్యమును భార్యా అనుభవించుటగాక మచ్చుజూచి పెండ్లియాడుట, బిడ్డలగని పెండ్లియాడుట, మొదలగు విదేశ స్త్రీ స్వాతంత్ర్యమును భారతాంగనల కంటగట్ట తలచినయెడల నయ్యది దురాగతమని తెలుప తగియున్నది. మహారాజుల దాంపత్యముతో సమముగా భిక్షుకులదాంపత్యము సయితము గౌరవముగా, గాంభీర్యముగానడుచుచున్న విధానమును నిర్మూలించి వ్యభిచారపు పట్టానొసంగనెంచు సంస్కరణవాదు లవివేకులనుటక్రమమై యున్నది. బాలికలకు విద్యావశ్యకతను గూర్చిచెప్ప వలసినపుడు హూణవిద్యమిక్కిలి వ్యయముతో కూడిన దగుట వలనను, నయ్యది యుద్యోగములకు మాత్రమె ఆస్పదమగుట

వలనను గడపదాటక గృహకృత్యములదీర్చి కీర్తి నార్జింపవలసిన భారతాంగనకు పరసేవాభాజనములగు నుద్యోగములు దూష్యములగుటవలనను, విదేశభాష వర్జనీయమని తెలుపుచున్నాడను. "హిందువులు తమస్త్రీలను దుష్టులబారినుండి రక్షించుకొను సామర్థ్యమును సంపాదించుకొను నంతవరకు హిందూసంఘము జాతి ప్రతిష్ఠాగౌరవముల యందప్రతిహత స్థైర్యమునందునంత వరకు తమ కన్యలను విద్యావిహీనలగానుంచియైన గృహాంతరముల యందుంచుట యుక్తము. హిందువులపై నాగరకతా విజ్ఞాన విషయములలో బయల్వెడలు విమర్శనల నెదుర్కొనుటకు వారు స్వసంరక్షణ సిద్ధాంతముల నాశ్రయించ వలయును. ప్రకృతవిద్యావిధానముమనకన్యల కననుకూలము. వారినెన్నడును పాఠశాలలలోనికి కళాశాలలలోనికిని లాగకూడదు. వారికి నియతస్థానములు గృహములు. నియత వృత్తి సంతానపోషణణము" నని హిందూమహాసభాధ్యక్షులగు భాయిపరమానంద గారు చెప్పిరి. ఆ॥ ప్రస్. 29-6-34.

## బ్రాహ్మణ్యము

వర్ణాశ్రమమునందగ్రగణ్యులగు బ్రాహ్మణులు సృష్ట్యాది నుండియు, దరిద్రులయినను విద్యానిధులేయనియు, నిరాడంబరులైనను సర్వజ్ఞులేయనియు, రాజులుగాకున్నను రాజ్యనయతంత్రజ్ఞులేయనియు, భోగపరాయణులుగాకున్నను త్యాగశీలురే యనియు, శాసించుసాహసులుగాకున్నను శాపానుగ్రహదక్షులే



యనియు, విదేశచారిత్రకులవల్లను, రాజాదిరాజులవల్లను, నేటి వరకుకీర్తింపబడుచుండిరని తెలియుచున్నది. మోక్షోపాయములగు యోగశాస్త్రములనేమి స్మృతులనేమి, కాలచక్రానుకూలములగు జ్యోతిషశాస్త్రమునేమి, ఆరోగ్యములలవడజేయు వైద్యశాస్త్రమునేమి, దేశభాషాగ్రంథరాజములనేమి, గీర్వాణ భాషాగ్రంథములనేమి, బ్రాహ్మణులే ప్రకటించుటవలన హిందూదేశమునకు బ్రాహ్మణప్రాశస్త్యమే మకుటముగా జెప్పవలసియున్నది. పూర్వకాలమునుండియు, మహారాజులున్నూ, భూస్వాములున్నూ, జమీందారులున్నూ, ధనికులున్నూ, వెలమ, కమ్మ, రెడ్డి, మొదలగు బ్రాహ్మణేతర తెగలలోనే యుండుటనుబట్టియు, బ్రాహ్మణుడేకాలమునందును దరిద్రదేవతతో కాపురము చేయవలసినవాడగుటనుబట్టియు విద్యావిహీనుడుగా నుండవలసిన బ్రాహ్మణుడీనాటికిని విద్యాకౌశలమున మిన్నందియుండుటయే యీజాతికిగల మేధాసంపత్తు ప్రశంసనీయమని చెప్పవలసియున్నది. వీరు కూరగాయలు, పాలు, పండ్లు, మొదలగు సాత్త్వికాహారముల భుజించుటయు, కొల్లాయి గుడ్డలతో దేహాచ్ఛాదనమొనర్చుకొనుటయు, పిడకలతో వంట జేసికొనుటయు, నుపవాసాది నియమబద్ధులగుటయు, ప్రవాహోదకములందు వేకువ స్నానమాచరించుటయు, నక్తభోజనమారగించుటయు, జప, తప, హోమాదులవలన దైవారాధన మొనర్చుకొనుటయు, వేదశాస్త్రములభ్యసించుటయు, వేదశాస్త్రానుకూలములగు కర్మములాచరించుటయు నిరీశవయాత్రోపాయమ్ములగుటవలన నిరాడంబరతయు, నహింసానియమంబును

వీరికి యుగ్గుపాలతోఁ గలవని తెలుపవలసి వచ్చుచున్నది. ఇప్పటికి బ్రాహ్మణులలో సంగీత, సాహిత్య, కవిత్వ, తర్క, శబ్ద శాస్త్రములవల్ల తమపూర్వులార్జించిన యీనాంభూములన్నియు నాంగ్లవిద్యాతృష్ణచే బ్రాహ్మణేతరుల వశములగుటయు, దొరతనమువారిచే నుద్యోగముల బడయుటకు నల్పసంఖ్యాకుడగు బ్రాహ్మణు డధమస్థానమునలంకరింప బడుటయు నిర్ధనుడగు బ్రాహ్మణుడపేక్షించుచున్న రాజభాష బంగారముకంటె విలువగలదిగా పరిణమించుటయు, వివాహాది దుశ్శాసనములు బ్రాహ్మణుల బాధించుటకే సంకల్పింపబడిన వగుటయు, తటస్థించినందున హిందూదేశమునందు తనధర్మముతో తాను జీవింపదలచిన బ్రాహ్మణుడు శత్రుసేనలమధ్య జిక్కిన నిరాయుధుడగు యోధునివలె శాంతిగోల్పోయి మాత్రమె జీవింపవలసి వచ్చెనని తెలుపవలసియున్నది. 17 కోట్ల బ్రాహ్మణేతరులకును, 6 కోట్లమాలలకును, 7 కోట్ల మహమ్మదీయులకును స్వభావముగాగల ప్రౌఢావివాహములను కర్మజ్యేష్ఠతనుబట్టియు, నాహారనియమమును బట్టియు, సన్నిసంఘములనుండి ప్రత్యేకింపబడిన యిట్టి పవిత్రమైన జాతిపై శాసనరూపమున ప్రయోగించి మాంసాహారులు, సంస్కారులు, తమరాక్షసభావమును చాటుకొనుచున్నారు.

"ఈ నాటి బ్రాహ్మణులు 3000 యేండ్లనుండి పారంపర్యానుగతములగు విద్యానియమసంపదలకు బుట్టిన సాఫల్యవిగ్రహములు, దానంజేసి తమచుట్టునావరించుకొన్న



జాతులన్నిటిలో విలక్షణమగు జాతిని నిర్మించుకొన గలిగిరి మార్గమునబోవు యే బాటసారి అయినా బ్రాహ్మణుని ప్రత్యేకించి గుర్తింపగలడు".

సర్. డబ్లియు డబ్లియు. హంటర్సుహిస్టరీ ఆఫ్ ఇండియా.

"నిజమైన బ్రాహ్మణుడిప్పటికిని ఐరోపాదేశీయాచారములచే మురికిజెందక తీక్ష్ణమైన స్వాత్మజ్ఞానమును స్వాత్మగౌరవమును స్వాత్మనిశ్చయమును తనముఖారవిందముయొక్క ప్రతినాళమునందును ప్రకటించుచు ప్రత్యంగ సంచలనమునందు నిరూపించుచూ పరమేశ్వర నిర్మితమగు భూమిపైనడుగుబెట్టు ప్రతి మానవజాతిలో నుత్కృష్టమైయాశ్చర్య జనకమైనజాతిగా విలసిల్లుచున్నాడు".

షిరింగుదొర. కేస్టుస్. యండుట్రైబ్స్

"బ్రాహ్మణులు ప్రభుత్వమువారికి మెదడువలెనుండు విజ్ఞానశాఖ"

లార్డు. కర్జన్ ప్రభువు.

"హిందూదేశము జాతిమత ప్రకీర్ణమైయున్నది. బుద్ధిబలమువలనగాని ధనబలమువలనగాని జాతిలో, భేదమేర్పడదు. అగ్రజుడైనవాడగ్రజుడే అంత్యజుడైనవాడంత్యజుడే. వేలకొలది సం॥ర ములనుంచి బ్రాహ్మణులను పూజనీయులుగా ప్రజలు భావించుచున్నారు. వారి మేధాశక్తి అపారము. ప్రతివిషయమునందును బ్రాహ్మణాధిక్యత తేటతెల్లమగుచున్నది. అల్పసంఖ్యాకులైనను వారు ప్రజాజీవనమునందగ్రస్థానము వహించియున్నారు... ...వారిలో 2 కోట్లకు 1 లక్ష బాలవితంతువులు కలరు."

సైమను కమిటీ రిపోర్టు.

ఇఁకనస్పృశ్యతనుగూర్చి మహాత్మాగాంధిగారు ప్రాణత్యాగమొనర్చుకొనెదనని ప్రకటించి హిందూమతమునకు పీఠస్థానమగు కాశీపట్టణమునకు జేరగా 27-7-1934 తేదీన 1,50,000 మంది సనాతన ధర్మవాదులు 20,000 నల్లజండాలతో శ్రీ స్వామిలాల్‌నాథ్. వీరేంద్రనాథ్ అరుణ్ మొదలగు మహానాయకుల అధ్వర్యముక్రింద "సనాతనధర్మకీ జయ్" హిందూసంఘమునకు గాంధి నాయకుడుకాడను వీరాలాపములతోడను గాంధి మరలిపొమ్మను ప్రకటనపత్రములతోడను నిరసించిరని 4-8-1934 పాంచజన్యము ప్రకటించుచున్నది. చండాల దేవాలయ ప్రవేశమునుగూర్చి వీరును వీరియుద్యమనాయకులున్నూ, ప్రోత్సాహించి శ్రీరంగయ్యరుగారిచే అసెంబిలీలో 1933 సం॥ రం॥ ప్రవేశపెట్టబడిన బిల్లుపై రమారమి 863 సనాతన ధర్మసంఘముల ఆక్షేపములజూచి దొరతనమువారి అసమ్మతిని తెలుపుటతోడనే శాసనకర్తచే బిల్లునుపసంహరించుకొనబడెనని తెలియ వచ్చుచున్నది. ఆబిల్లునెత్తివేయునపుడు హోంమెంబరగు "సర్. హెన్రీక్రెయిక్" గారు కోట్లకొలది సంఖ్యగల ప్రజల నిత్యకృత్యములతో నత్యంత సంబంధముగల సంస్కరణముక్రమప్రబోధము వలన జరుగవలయును. గానిగొడ్డంటిపెట్టునవారి యిష్టమునకు వ్యతిరేకముగా శాసనముచేయుట కూడద"ని చెప్పియున్నారు. హిందూస్థానమునందస్పృశ్యతయనునది కమ్మ, వెలమ, రెడ్డి, తెలగ, చాకల. మంగల, కమ్మర, దొమ్మర మొదలగు రమారమి40 తెగలుగల 17 కోట్లబ్రాహ్మణేతరులచే, పాటింపబ



డుట లేదనియు, వీరు7కోట్ల మహమ్మదీయులను స్పృశించినను దోషములేదనియు బ్రాహ్మణేతర తెగలోనే మహారాజులు, భూస్వాములుధనికులు పెక్కురు గలరనియు నస్పృశ్యత నెఱుగని యింత పెద్దసంఘమునుండియే నెటాల్, అస్సాం, బాస్రా, పినాంగు, మొదలగుదేశములకు తెలగ, ఉప్పర. వడ్డె మొదలగు జాతులు వలసపోవుచుండుట కలదనియు, నింతపెద్ద సంఘమే దారిద్ర్యమునుండి తరింపజాలనప్పుడు మాలలు కూడా వీరిలో చేరలేదని సంస్కరణవాదియేల భ్రమించెనో తెలియజాలకున్నాడను. ఇకమాల, మాదిగ, డక్కల, పంబల మొదలగు 6 కోట్లొకరినొకరు స్పృశింతురనియు వీరే గ్రామములలో బ్రాహ్మణేతరుల తరువాత రెండవస్థాన మాక్రమించిరనియుదారిద్ర్యమన్ని సంఘములందును నిండియున్నప్పుడు వీరికస్పృశ్యత వలన దారిద్ర్యము, కలిగినట్లు వెల్లడించుట అక్రమమని తెలియుచున్నది. ఇఁకబ్రహ్మ, క్షత్రియ, వైశ్యులు 6 కోట్లలోనొక్కొక్క తెగ 2 కోట్లు మాత్రమే కలరనియు, నొక తెగమరియొక తెగను స్పృశింప నొల్లదనియు, దారిద్ర్యమంతటను తాండవ మాడుచుండెననియు నిజముగా నల్పసంఖ్య అనగా బ్రాహ్మణవర్గమందేకలదని తెలుపుచున్నాడను. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రపంచములలో వరుసగా పైవారు క్రిందివారిని స్పృశింప జెల్లదను సిద్ధాంతము ననుసరించి స్పర్శమువల్ల దోషము పంచముల కన్వయింపనేరనప్పు డస్పృశ్యతానివారణోద్యమము పంచములకొఱకుద్భవించిన దనుటకంటె పంచమేతరవర్ణములనుగాని వారారాధించు దేవాలయములను

గాని నిర్మూలించుటకె సంస్కరణవాది పన్నిన పన్నుగడయని తెలియుచున్నది. స్పర్శదోషము. సూర్యాదినవగ్రహప్రచారము, ఔరసత్వాదులందలి రక్త ప్రసారము, ద్వైతాద్వైత నిర్ణయములను నవిశవ్య చక్షుర్లాభముగల మహర్షులచే నిర్ణయింపబడినందున బాహ్యచక్షువుతో వ్యవహరించు సంస్కరణవాది వీనినెరింగినట్లు నటించి నిగ్రహింపబూనుట సాహసమని చాటతగియున్నది. అగ్రజన్ములు పంచములను స్పృశింపకుండుట యాజాతికి నూనత యగుటవలన నట్టినూనతను తొలగించుటకాలయ ప్రవేశాధికార మొసంగుచుంటిమనిన యెడల నయ్యది విద్యావిహీనునకు గల నూనతను తప్పించుటకు విద్యాధికుని బంధించెదమనుటను బోల్పదగదా? అని ప్రశ్నింపవలసియున్నది. ఆహార విహారములయొక్క నపవిత్రతనుబట్టి అస్పృశ్యతయేర్పడెనని చారిత్రకులెల్లరంగీకరించి నప్పుడాలయ ప్రవేశ మొసంగుట అస్పృశ్య తానుకూలవ్యాపారమున కగ్రస్థానమిచ్చుటయేకాదా యనవలసి వచ్చుచ్చుచున్నది. ఆంగ్లేయుడు తురుష్కమతమవలంబించినను తురుష్కుడాంగ్లేయమతమవలంబించినను తురుష్కులుగాని, ఆంగ్లేయులుగాని, వానిని తమమతసంస్కర్తగా నెట్లుస్వీకరింపరో అట్లు వేదోక్తమైన హిందూమతమునుండి వేదబాహ్యమైనవృత్తులవలంబించిన సంస్కరణవాదిని ప్రాజ్ఞులుసజాతీయునిగా నంగీకరింప జాలరని తెలుపవలసి వచ్చుచున్నది.

దొరతనమువారివలనమార్లె, మింటొసంస్కరణములును, మాంటుఫర్డు సంస్కరణములున్నూ, ప్రసాదింపబడు



నాటికి గాంధిగారు హిందూదేశములో లేనట్లె భావింప వలెనని తెలుపుచున్నాడను. మహాత్మా గాంధిగారికి పూర్వమందున్న కాంగ్రెస్సు ప్రశిడెంటెవ్వరును ధర్మద్రోహ శాసనము లపేక్షింపకపోగా 1916 స॥ రం॥ కాంగ్రెస్సు ప్రసిడెంటుగాయున్న శ్రీయుత అంబికాచరణముజుందారుగారు క్రైస్తవమున గల శాఖలున్నూ వానిలో నొక్కొక్క శాఖతో మఱియొకశాఖకు గల భేదభావములున్నూ ప్రకటించుటమూలమున హిందూదేశమున వివిధశాఖ లున్ననూ లోపము లేదని విదేశీయులకు తృప్తికలుగునట్లు తెలిపిరని విన్నవించుకొనుచున్నాడను. శ్రీ విక్టోరియా మహారాణిగారి కాలములో మతమును గూర్చి అభయప్రదాన మొసంగిన నాటినుండి సార్వభౌము లెల్లరు మతతాటస్థ్యమునే ప్రకటించిరనియు పాఠకు లెఱుంగగోరుచున్నాడను. ఇక రాజప్రతినిధు లెల్లరు మతతాటస్థ్యమునే అంగీకరించుట గాక శారదా బిల్లునాటికాలములో యున్న లార్డు ఇర్విన్ ప్రభువుగారు దండి సత్యాగ్రహ కాలములో పెషావరు ప్రాంతములందు నవజీవన్ అను సంఘము కలదనియు, నాసంఘమువారు శారదా బిల్లును దొరతనమువారు పెట్టించి మతద్రోహ మొనర్చుచున్నారని ప్రజలకు బోధించుచుండిరనియు, నా బిల్లును కాంగ్రెస్సువారే పెట్టిరిగాని దొరతనమువారికందేలాంటి జోక్యము లేదని ప్రచురించిరని తెలియగోరుచున్నాడను. హిందూస్థానమునం దాంగ్లవిద్యాంకురమును స్థాపించిన లార్డుమెకాలె ఆంగ్లవిద్య నేర్చిన భారతీ

యుడు తన మతమును నిందించి క్రైస్తవమతములో కలియునని వ్రాయుటమూలమున ఆంగ్లవిద్యావాసనావశ్యులగు భారతీయులు స్వాయముగ తమ మతమును గోల్పోవుదురని మాత్రమె సూచింపగలిగెను గాని హిందూమతమును శాసనబద్ధముగ జేయవచ్చునని యెంతమాత్ర మూహించి యుండలేదని తెలియగోరుచున్నాడను. ఇట్టి స్థితిలో మహాత్మా గాంధిగారు ధర్మమునకును నీతికిని ప్రజాభిప్రాయమునకును విరుద్ధములగు చట్టముల బుట్టించుటకు కారణము సంస్కరణవాదులును వారిచే ప్రకటింపబడు దేశభాషా విదేశభాషా పత్రికారాజములని తెలియుటకు కొన్ని అంశములిం దుదహరించుచున్నాడను. పూర్వకాలమునుండి భరతవర్షమునకు రాజకీయమునుగూర్చిగాని మతమునుగూర్చిగాని విమర్శించుటకు దేశభాషాగ్రంథములే యాధారము లయ్యెననియు గ్రంథకర్తలు దైవోపాసకులుగను, విద్యానిధులుగను, న్యాయాన్యాయ విమర్శకాగ్రణులుగను బరిణమించుట వలన నేవిధమునను విప్లవమున కవకాశ ముండెడిదికాదనియు నూహింపవలసి యున్నది. వర్తమానకాలమునందు విదేశ సంప్రదాయానుసారము పత్రిక లేర్పడుటయు, నాపత్రికాధిపతులు హూణవిద్యాప్రవీణులుగను, హిందూమత విరుద్ధమగు సంస్కరణవాదులుగను వర్తించుటయు తటస్థించినందున దేశీయపత్రికలయందు హిందూమతమున కంగుళమేని స్థానము లభించియుండలేదని తలంపవలసి యున్నది. 1933 సం॥ రం॥ ఆప్రాంతముల బరోడా, భోరు సంస్థానములయందలి దేవాల



యములలో నస్పృశ్యులు ప్రవేశించుట కధికార మొసగబడెనని ప్రచురించినప్పు డా మహారాజుల యౌదార్యము, నాకార్యము కొనియాడు సంస్కరణవాదుల బుద్ధిచాకచక్యమును శ్లాఘించుటతో తృప్తిజెంది యచటి ప్రజాభిప్రాయ మీకార్యముపట్ల యెట్లున్నదియు వెల్లడింపకుంటయే హిందూదేశమందలి పత్రికారాజముల ప్రచార రహస్యమని తెలుపబడుచున్నది. సనాతన ధర్మవాది వికలాంగుడైనను లేక దరిద్రుడైనను లేక విద్యావిహీనుడైనను తన కిహపరలోక సౌఖ్యము నొనగూర్చు దైవమున కేర్పడిన యాలయము చండాలప్రవేశార్హమని వినుట తోడనే యతని హృదయపరివేదనము వర్ణనాతీతమై యుండునని తెలియుచుండగా నట్టి వేదనమును వెల్లడింపక దేశమంతయు ప్రశాంతఘోషమైనట్లు పత్రికలు చాటుట మిగుల విషాదకరమని గ్రహింపబడుచున్నది. ఆదేశపు ప్రజ లెల్లరు హూణవిద్యాపారంగతులుగ గాని లేక సంస్కరణవాదులుగ గాని లేక నాస్తికులుగ గాని యుండుట యసంభవమని విశ్వసించు నంతవరకు ప్రజాభిప్రాయమును వెల్లడింపని పత్రికాలోకము తమ నిష్పాక్షిక దృష్టిని మఱుగుపఱచుకున్నట్టె భావింపవలసియున్నది. యుగసహస్రములనుండి తమ వంశ ఋషులవల్లనేమి,తమ గోత్ర ఋషుల వల్లనేమి, పోషింపబడి ముందు రక్షణ నిమిత్తము తమ పితృపితామహులచే తమ చేతులలో పెట్టబడిన దైవారాధన సంప్రదాయపు హక్కునునిర్మూలింపబడుట నచటి గృహస్థులెల్లరు స్వైచిరనుకొనుట కంటె నీకాలములో వెల్లడించుటకు

పత్రికలుకూడా లభింపక యల్లాడుచుండి రనుటయే యుచిత మని భావింపబడుచున్నది. పత్రికాధిపతులు సనాతనధర్మ వాదులచే రచింపబడిన వ్యాసములుగాని గ్రంథములుకాని ప్రచురింపకపోవుట మూలమున హిందూధర్మమను లయింప జేయుటకును విదేశధర్మమును విజృంభింప జేయుటకును బద్ధకంకణు లైనట్లు గమనింపవలసి యున్నది. శ్రీయుత అంబికా చరణముజుందారుగారు హిందూమతమున పెక్కు శాఖ లున్నను లోపము లేదని వెల్లడించిన యుపన్యాసమును దేశీయ పత్రిక లన్నియు మెచ్చిగానము జేయుటయు కృష్ణా జిల్లాసంఘమువా రా యుపన్యాసమును పుస్తకరూపమున ప్రచురించి ప్రజల కుచితముగ నొసంగుటయు సంభవించి యుండగా నేడు మత మక్కరలే దని నాయకులును, పత్రికలును కోలాహల మొనర్చుట, తమకు గల యాత్మగౌరవమును నిర్మూలించుకొనుటకే కాగలదని తెలుపవలసియున్నది.

కాంగ్రెస్సు జరిగిన మరునా డేస్వల్పులవల్లనో జరుపబడినట్టియు రాజకీయ విషయములతో సంబంధము లేనట్టియు దొరతనమువారిచే కాంగ్రెస్సు నిరోధింపబడినప్పు డంతర్ధానము నందినట్టియు హిందూధర్మమునకు విరుద్ధమైనట్టియు సోషల్ రిఫారం అనుపేరుతో జరుపబడిన సభాసంప్రదాయములను నేడు కాంగ్రెస్సులో మిళితము చేయుట స్వాత్మగౌరవముగల పత్రికాధిపతి సహింపగలడా ? యని శంకింప వలసియున్నది.



నేడు తిరువాన్కూరు మహారాజావా రస్పృశ్యులకు దేవాలయ ప్రవేశాధికార మొసగినట్లు ప్రకటింపబడినప్పుడు కూడా నచటి ప్రజలెల్ల రామోదించినట్లు పత్రికలు జరించి యచటి ప్రజాభిప్రాయమును వెల్లడింపక మరుగుపఱచినను 1937 సం॥ రం॥ ఫిబ్రవరి 6వ తేదీన శ్రీ చతుర్భుజదాసుగారు మద్రాసు సనాతనధర్మ సభాధ్యక్షులుగ నుండి శ్రీ తిరువాన్కూరి మహారాజులవారి యుద్యోగులుతప్ప అచటిప్రజలెల్ల రాలయములోనికి వెడలుట లేదని చాటుట వలన కొంత గుట్టు వెల్లడింపబడెనని తోచుచున్నది.

చండాలదేవాలయ ప్రవేశశాసనమువలన నగ్రవర్ణముల కింతటినుండి దేవాలయములు వర్జనీయములని మాత్రమే తెలియునుకాని సనాతనధర్మవాదు లస్పృశ్యులతో దేవాలయమున జేర్చుట కర్హమైనది కాకుండుటవలన సంస్కరణవాదు లనుకొన్నంత ప్రయోజనమీ చట్ట మొసంగజాలదని తెలుపవలసియున్నది. అస్పృశ్యు డొక డాలయమున ప్రవేశించినను గుడి కథమదశ సిద్ధించును కాన సంస్కరణ పత్రికాధిపతు లొకవిధముగ కృతార్థత జెందినట్లు భావింప తగును గాని వారిశ్వాసానిలమునను, దీర్ఘముగ జేసికొని యిక 400 సం॥ రములు జీవించినను నాలయములు పాడుబడుటతప్ప వేఱులాభము గానని మాలమాదిగ లెల్లరు కలిసి గాని వేరుగ గాని యీయుద్యమమున పాల్గొనుటను జూడజాలరని చాటతగియున్నది.

తమ కులక్రమాగతమగు మర్యాద ననుసరించి మాల ప్రవేశించిన యాలయమున మాదిగయు, మాదిగ ప్రవేశించిన యాలయమున మాలయు, ప్రవేశింప నొల్లకుండుటవలన సంస్కరణపత్రికాధిపతులు పురిగొల్పు దేవాలయోద్యమమున జాతుల నన్నిటి నేకోన్ముఖము జేయు ప్రధానసూత్రము భగ్నమగునేమో యని యూహింపబడుచున్నది. మాదిగ గాని లేక మాలగాని శాకాశీనులగు నగ్రవర్ణములచే తీర్థప్రసాదాదు లారగింపబడుచున్న గుడిలో సంస్కార పత్రికాధిపతులు తమ కొసంగిన ప్రవేశార్హత నిహపరలోక దూష్యమైనదని తృణీకరించుటను భావికాల దేశచారిత్ర్యమున ప్రాజ్ఞులు గమనింపదగునని నిశ్చయింపబడుచున్నది. జాతిసమ్మేళనమున కీయుద్యమ మన్వయింపకున్నను దేవాలయములు సులభముగ పాడుబెట్టుటకు తోడ్పడినప్పుడు దేవాదాయములు దాతల యుద్దేశ్యములకు భిన్నముగ వినియోగపడుచున్న వను నెపమున యీనాముల శేరీలక్రిందికి దొరతనమువారు మార్చుట కర్హత కలదను రహస్య మిందు సంస్కరణవాది గ్రహించియుండుననని తెలియగోరుచున్నాను. పత్రికాప్రచారమున గల సౌశీల్యమును పాఠకుల కెఱింగించుట కొక విలేఖరి వ్రాసిన లేఖ నిందుదహరించుచున్నాడను.

"శ్రీ గాంధిగారీమధ్య కలకత్తాకు వచ్చినప్పుడు నేను శ్రీవారిని ప్రత్యక్షముగ జూచుభాగ్య మబ్బినది. అట్లు చూచినప్పుడు వారు మంచి యాహారపుష్టి నందినవారివలె నాకుకనబడిరి కాని వారారు పైసలు విలువ గలిగిన యాహా-



రమును మాత్రమె నిత్యము భుజింతురని వినియుంటచే నాకు సందియ ముదయించినది. నా సందియమును నా మిత్రులును కలకత్తా మునిసిపల్ గజెట్టు పత్రికాధిపతులు నగువారు తీర్చిరి. 'చూడుము గాంధిగారి నిత్యసాత్వికాహారపట్టి' యని యొక జాబితా నా కందిచ్చిరి. అందు ప్రతిరోజు కావలసిన ఆహారదినుసు లిట్లు వివరింపబడినవి. '1 శేరు ద్రాక్షరసం, 1 శేరు మామిడిపండ్లరసం, 1 శేరు ఇతర ఫలముల రసం, 1 శేరు మేకపాలు, 14 బల్లగరిటెల తేనె' యీజాబితా నాకాశ్చర్యమును గలిగించినది. చిరకాలమునుండి పత్రికలలో పదేపదే గాంధిగారు రోజు కారు పైసలు విలువగలిగిన యాహారమును మాత్రమె పుచ్చుకొందురని మ్రోతలుమ్రోగునట్లు వ్రాయబడుట నాకు బాగా జ్ఞప్తియందున్నది. ఇంతకంటె యెక్కువ యబద్ధము లోకములో మఱియొకటి యుండబోదని నిశ్చయించుకొంటిని. ఆరు పైసలచే నెదురూపాయిల పని చేయింపగలుగుట మహాత్మ్యమేగాక మఱేమిటి? బహుశః గాంధిగారుదేవునికంటె గొప్పవాడేమో? ఆయన శాస్త్రాలేయదార్థములేమో? ఆవిషయములు మన బుద్ధుల కగోచరములు గదా!

అని కలకత్తా ట్రూత్ పత్రికావిలేఖరి వ్రాసెనని 18-8-34 పాంచజన్యము తెలుపుచున్నది.

"సంప్రదాయము తొలగించుట పాపకార్యము: సంప్రదాయము భగవద్దత్తమని యంగీకరించి యది యనివార్యమైనవిధిగ గౌరవించి యాప్రకారము నడుచుకొనవలెను"

మహాత్మా గాంధిగారు వ్రాసిన రోమాఁరోలాండు 114 పేజి

ఆయీగుంపులకు నంటియున్న యపవిత్రత, పవిత్రతమను భావ మీగుంపులు దూరదూరముగ నుండుకారణములు.

కెట్‌కార్ పేజి 21 వాల్యూము 2

హీనజాతులవా రవర్ణులని బహిష్కరింపబడుటకు వారివారి వ్యాపారముయొక్కయు నాహారముయొక్కయు నపవిత్రతయే అన్నిటికంటె గొప్పకారణము.

సెనార్ట్ పేజి 884

సామాన్య శూద్రుడైనను గౌరవము, ధర్మవిచారము గలవా డయ్యేనేని భ్రష్టబ్రాహ్మణునితో సాంగత్యము చేయడు. సంభాషింపడు. సెనార్ట్ పేజి 71

ఒకస్త్రీ జనసమూహములో నున్న "యేసు" వెనుకకు వచ్చి వస్త్రమును ముట్టెను. వెంటనే యేసు తనలోనుండి ప్రభావము బయలువెడలె నని గ్రహించి నావస్త్రము ముట్టిన దెవరని యడిగెను.

బైబిలు 5వ అధ్యా 28-31 పద్యములు

దేశమంతయు పరరాజులు కొట్టుకొనిపోయినను కులధర్మములు నిలువబడి యున్నవి. మన నాజూకు సిద్ధాంతములను మించిపోయినట్టిది యగు నొకానొక బలవత్తర మగు శక్తిప్రాబల్యము (హిందువుల) కులధర్మములందు కలదనుట కిదియే పరిపూర్ణసాక్ష్య మగుచున్నది.

ఎడ్మండు బర్కు ఉపన్యాసము



మాల, మాదిగ, యానాది మొదలగు నిమ్నజాతులు క్రైస్తవమతమును స్వీకరించుట వలన నంద విభక్తకుటుంబము లలో క్రైస్తవులు హిందువులు కలిసి యుండుట కలదనియు నిమ్నజాతులకు దేవాలయ ప్రవేశార్హత కలిగినప్పుడా క్రైస్త వులుకూడా ఆలయములలో ప్రవేశించుట సంభవించు ననియు మతాంతరులకు కూడా హిందూదేవాలయములపై హక్కు కలిగినప్పుడీ యుద్యమము కొనసాగుటకు మహాత్ము డెన్ని బొంకులు బొంకినను వర్ణసంకరరూపమున హిందూమతద్రోహ మొనర్చుటకే కాగలదని స్పష్టీకరించుచున్నాడను.

శ్రీమన్మన్నవ లక్ష్మణమంత్రి పౌత్ర పున్నమాంబా
బుచ్చిరాజామాత్య తనూభవ, కవి శేఖర:
మన్నవ నరసింహపాకయాజి ప్రణీతం
బైన హిందూమతద్రోహమునందు
ప్రథమభాగము సంపూర్ణము.

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః.



Janakiram Press, Tenali. 500/9-38